

ఎన్ సి సి. కేడెట్లు హరిజనుల పిల్లలను స్నానం చేయిస్తున్న దృశ్యం 21-5-1960 న మేడ్చెల్‌లో 12 ఏ. సర్కిల్ ఎన్ సి సి శిబిరం సాంఘిక సేవ జరిపింది



హరిజనుల ఉపయోగార్థం 12 వ సర్కిల్ ఎన్ సి సి శిబిరం కేడెట్లు 21-5-60 న మేడ్చెల్‌లో హరిజనుల నిమిత్తం బావిని నిర్మిస్తున్న దృశ్యం.

# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి 4 | జూన్, 1960 | సంచిక 8

జ్యేష్ఠ, 1882 శకము

## విషయసూచిక



ముఖచిత్రం:— 'చల్లగాలిలో': హైదరాబాదు పౌరులకు, పైనుంచి వచ్చే వారికి కూడా వేసవి కాలంలో గండిపేట చెరువు చక్కని విశ్రాంతి కేంద్రంగా ఉపకరిస్తుంది. చిత్రంలో ఈ ప్రదేశానికి చెందిన దృశ్యాన్ని చూడవచ్చు.

వెనుకఅట్ట:— తిరుపతి కొత్త సత్రము: ఇటీవల ప్రభుత్వంచే తెరవబడిన యాత్రిక సమాచార కేంద్రం ఇందులోనే ఉంది.

**చందా వివరాలు :**

సంవత్సరానికి ... 2 రూపాయల 16 నయాపైసలు.

విడిప్రతి వెల 18 నయాపైసలు.

Edited and Published by the Director of Information and Public Relations, Hyderabad
Printed at: Vir Milap Press, Mukaramjahi Road, Hyderabad.

# "ఆంధ్ర ప్రదేశ్" ప్రకటన రేట్లు

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ రూ | సగం పేజీ రూ | పావు పేజీ రూ | పూర్తి పేజీ రూ | సగం పేజీ రూ | పావు పేజీ రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరు పేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శతి రిబేటు ఇవ్వబడుతుంది

## షరతులు

1. సాంకేతిక వివరాలు: $10\frac{3}{4} \times 8\frac{1}{2}$" డెమ్మీ.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ దానికయ్యే మొత్తమూ ప్రతినెల 8 వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే. ఆ ప్రకటన మరుసటి నెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని. లేక క్రాస్‌చేయబడని డిమాండు డ్రాఫ్ట్‌ద్వారాగాని పంపవలెను. డిమాండుడ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైద్రాబాదు-దక్కన్ పేరిట వ్రాయబడవలెను
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యతవహించదు.
6. ప్రకటన ఎంతస్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసిందీ. ఒక భాష పత్రికలో వేయవలెనా. లేక మూడు భాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్,<br>
సమాచార, పౌరసంబంధముల శాఖ<br>
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం<br>
హైద్రాబాదు దక్కన్—1.

# ప్రణతి

— రచన: అనూరాధ

ఫాలతలమ్మునన్ వెలుగు భవ్య సుధామయ రేఖతోడశం
పాలతికాలసద్రుచి సమాన శరీరము తోడ కింకిణీ
జాల పరస్పర స్వనిత చారు పదమ్ములతోడ భావుక
శ్రీ లొలికింప నాయెద వసింపు సుధీజన భూతి భారతీ !

మేలి పసిండి గాజుల సమీకృత నాదము వల్లకీ గుణో
ద్వేల రవమ్ము గూడి శ్రుతి పేయత గూర్పగ నెమ్మి దమ్మిపూ
చూలి నపాంగ వీక్షణవిశుద్ధ సుధాఝురి దేల్చి హంసరిం
ఛోళికి పాటలన్ గఱపు సుందరి నాకు ప్రసన్నయయ్యెడున్.

నా కవితా మధూదయ మనారత మాంధ్ర కవీంద్రలోకహే
వాక మనోవినూత్నమయి వర్ధిలి శాశ్వత కావ్య కన్యకా
స్తోక దరస్మితేందురుచి జొక్కెడు నటులనుగ్రహింపు నా
శీక భవాస్యనర్తన విలీన విశారద సత్కృపాస్పదా !

—:*:—

(మే 27 వీరేశలింగం వర్ధంతి)

# సాహిత్యరంగంలో....సాంఘికసమరాంగణంలో సవ్యసాచి శ్రీ కందుకూరి

— 'ఉషశ్రీ', 'కనక్ ప్రవాసి'

రాజు కాలాన్ని నడుపుతాడా?

కాలం రాజును నడుపుతుందా?

అనే ప్రశ్నకు సమాధానంగా, మహారాజే కాల మహా ప్రవంతిని నడుపుతాడంటుంది మహాభారత మహేతిహాసం.

వాస్తవానికి కాలానికి కళ్లెంవేసి నడిపిన రౌతు రాజులే చరిత్రలో చిరస్థాయిగా ఉండిపోయారు. కాల చరిత్ర వారి పేర్లతోనే ప్రత్యేక ప్రకరణాలను సంతరించుకొని అలరారుతోంది. కాల చోదితులు అనామకులుగానే ఉండిపోయారు.

ఎందరో రాజులు....

మరెందరో మహారాజులు

ఈ భువిని పాలించినా ..

మాంధాత, శిబి, ఇక్ష్వాకు, రఘు, ధర్మజ ప్రభృతులే నేటికీ ప్రజల నాల్కలపై నిలిచి ఆడుతున్నారు

కాలాన్ని నడిపిన ప్రభువులు వారు.

ప్రస్తావించినదంతా యుగాంతర విషయమూ ఐతిహాసికాంశమున్నూ. అవన్నీ నేడు కథలూ-గాథలూ అయినాయి

*   *   *

నూట పన్నెండు సంవత్సరాల క్రితం ... 1848 ఏప్రిల్ పదహారో తేదీన జన్మించిన కందుకూరి వీరేశలింగమనే శిశువు తన బాల్యంలో అసాధారణ కార్యాలేమీ చెయ్యలేదు. పరిమళిస్తూ పుట్టిన పువ్వుకాదది. అందరిలానే ఆయనా పుట్టాడు. అందరిలానే ఆయనా పెరిగి చదువుకుంటూ వచ్చాడు. ఆ నాటి ఆచార ప్రకారం చిన్నతనంలోనే పెళ్ళి చేసికొన్నాడు. మామూలుగా ఉపాధ్యాయ వృత్తి సాగించాడు. చాలా లావా దేవీలు పడ్డాడు. అంతే! అందుచేత అసాధారణ జన్మమూ, అద్భుత ప్రదర్శనమూ అమేయ ప్రతిభా కౌశలమూ ఆయన సొమ్ములని అనవలసిన పనిలేదు

కానీ ...

అయన చేసిన దొక్కటే ...

కాలమనే అశ్వానికి కళ్లెం బిగించి ప్రక్కకు తిప్పి నడిపించాడు. అది ముందుకో వెనుకకో పోతూనే ఉంటుంది. పోయేదానిని ఆ దారిని పోనీయక అటకాయించి అదుపులో ఉంచుకొని తాను నిర్దేశించే మార్గాన నడపగలవాడే దిట్ట. అటువంటి వాడు కాల చరిత్రలో నూతనాధ్యాయం తీర్చి దిద్దగలుగుతాడు

వీరేశలింగం చేసిన పని అది....

అందుకే ఆయన ఆంధ్రులకనుదిన స్మరణీయుడు. ఆయన కృషిలో విజయం సాధించాడా? పరాజయమే ఆయనను వరించిందా?

అనే ప్రశ్న అనవసరం.

పరాజయం ఆయనను వరించి ఉంటే... !

## యత్రనార్యస్తు పూజ్యంతే....

వీరేశలింగం చేపట్టిన సమస్యలన్నీ స్త్రీలకు సంబంధిం

చినవేనని అన్నప్పుడు కొందరు సాహిత్య విషయమో! అని పరిహసింపవచ్చు. వాస్తవానికి వీరేశలింగం సాహిత్యాన్ని కూడా తన సమస్యల పరిష్కారానికి సాధనంగా మాత్రమే వాడుకున్నాడు కాని సాహిత్యం మీద ప్రత్యేక దృష్టి అయనకు లేదు దీని కాయన స్వీయ చరిత్ర సాక్ష్యమివ్వగలదు. ఇది విషయాంతరం.—

చరిత్రలో స్త్రీ విద్యను నిషేధించిన శాసనానికి అధారం లేకపోయినా సాంఘిక వ్యవస్థలో స్త్రీకి విద్యాదాన యోగ్యత నశించింది. దానికి కారణాన్వేషణ ఈ వ్యాసంలో అయేది కాదు. కాదు కానీ—స్త్రీలకు విద్య అవసరం అనే అంశాన్ని గుర్తించి విశ్వసించి అందుకోసం పాటుపడినవాడు వీరేశలింగం అంతేకాక విధవా వివాహాలకు అంకురార్పణ చేసినదీ ఆయనే. విచిత్ర మేమంటే విధవా వివాహాలకు వైదికాధారాలు చూపించి, స్మృతులనుండి ప్రమాణాలు చూపినా నాటి సామాజికులు అంగీకరించలేకపోయారు. తాము నమ్మి ఆరాధించి ఆచరణకు ప్రమాణంగా స్వీకరించిన స్మృతులనే వారు అంగీకరించకపోవడం ఈనాడు హాస్యాస్పదంగా గోచరించినా వీరేశలింగానికి మాత్రం అదే బలీయమయిన హేతువూ, పునాదిరాయి కూడా అయింది.

1851 డిసెంబరు 11వ తేదీ స్త్రీ జాతి చరిత్రలో ఒక అపూర్వ దినమని ఆయన భావించాడు. అంటే ఆ రోజున ఆయన కల ఫలించింది ప్రప్రథమ విధవా వివాహం ఆనాడు జరిపించాడాయన. అవసరంకాదు కాని వరుని పేరు గోగులపాటి శ్రీరాములు. ఆ వివాహ వార్త విని ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు తంతి వార్త ద్వారా తన ఆనందాన్ని ప్రకటించాడు.

* * *

## సంఘంలో వేశ్య....

ఆనాడు....

వేశ్యను ఉంచుకున్నవాడు రసికుడు.

అదిలేనివాడు పౌరుష హీనుడూ, అరసికుడూ.

లంచాలు పుచ్చుకోనివాడు అప్రయోజకుడూ, బుద్ధిహీనుడూ.

లంచం పట్టడం ఉద్యోగ ధర్మమని నాటివారి నమ్మకం.

వేశ్య లేని వివాహానికి శోభయే లేదని వారి విశ్వాసం గృహస్థుల గౌరవానికి భంగం వస్తుందిట!

నలుగురిలో తలవంపులట!

వివాహంలో ఎవరెక్కువ భోగంమేళాలు పెడితే ఆ పెళ్ళి అంత మహావైభవంగా జరిగినట్టులెక్క!

ఇదీ. నాటి వారిధోరణి—అయితే

పదమూడవ యేటనే జరిగిన వీరేశలింగంగారి వివాహానికి కూడ ఈ వైపువారూ ఆ వైపువారు చెరో మేళం పెట్టించారుట!

తరువాత ప్రథమ వితంతూద్వాహ సమయంలో కూడ అది మహావైభవంగా జరిపించేందుకు భోగంమేళం పెట్టాలని ఎక్కువ మంది బలపరచారు కాని గవర్రాజుగారూ పంతులుగారూ "ససేమిరా, వీల్లేదు" అని వ్యతిరేకించి ఆ ఛాయలకు పోకుండా తమ తీవ్ర అసమ్మతినీ దీక్షనూ ప్రదర్శించారు.

ప్రజాక్షేమంకోసం, తాను నమ్మినదానిని—ఏ పని చేయవలసి వచ్చినా స్వజాతివాడనిగాని, బంధువనికాని, మిత్రుడనికాని ఎవరిపట్లా విచక్షణ చూపలేదు పంతులుగారు.

ఎన్ని సద్గుణాలున్నా వారి మిత్రులు అత్మూరి లక్ష్మీ నరసింహంగారి దాంభికవర్తనాపేక్షనూ, సర్వజన ప్రియాచరణ కాంక్షనూ సహించలేక "దంభా చార్య విలసనము" అనే ప్రహసనాన్ని సైతం వ్రాసి వివేకవర్ధనిలో ప్రచురించే వరకూ. పంతులుగారు ఊరుకోలేదు.

బాల్య వివాహ నిషేధమూ స్త్రీ పునర్వివాహ దీక్షా వేశ్యా వ్యభిచార నిర్మూలనాది సంస్కారభావాలతో సంఘంపై ధ్వజం ఎత్తడం ఒకయెత్తు.

ఏర్పడిన శత్రువులేకాక దుర్నీతిపరుల దుశ్చర్యలను పత్రికా ముఖంగా వెల్లడించి ఖండిస్తూ మరికొందరితో విరోధం తెచ్చుకుని క్షైత్ర యాత్ర సాగించడం వేరొక యెత్తూ.

బాల్యంనుంచీ పట్టినపట్టు విడిచే స్వభావం కాదాయనది. ఆయనకు జంకు గొంకులులేవు. కండబలం లేకపోయినా ఆయనకు గుండె నిబ్బరం అధికం తలపెట్టిన ఏ ఒక్క పనినీ వదలక చేపట్టిన ప్రతి ఉద్యమాన్నీ దీక్షా దక్షతలతో కొనసాగించాడాయన.

పత్రికా ప్రకటనవల్ల పంతులుగారుకానీ గడించింది

లేదు కానీ శతృవులను కూడ కొని తెచ్చుకున్నారు. తన గ్రంథాల మీద వచ్చిన డబ్బునుకూడ పత్రికాభ్యుదయానికే వెచ్చించారు.

పంతులుగారి జీవితాన్నంతనూ పరిశీలిస్తే ఒకేఒక్క విషయం గోచరిస్తుంది. సాంఘిక దురాచారాలను ఖండిస్తూ సంస్కరణ దృష్టితో లోకానికి వ్యతిరేకంగా ఎదురీత ఈదేవాడు తానాశించిన లక్ష్యసిద్ధికి ఎంతో ఓర్పూ శాంతమూ వహించాలి

## ఏకోహి దోషో

కాని పంతులుగారిలో అవి ఏకోశానాకనిపించవు ఆయన దొక విచిత్ర తత్త్వం, స్వీయచరిత్రలో అక్కడక్కడ సందర్భవశంగా ఆయన తన లోపాలను సైతం చెప్పుకొన్నారు.

"ఏ హేతువు చేతనో కాని యీశ్వరుడు నన్నుఁ గార్య వాదినిగాఁ గాక ఖడ్గవాదినిగా సృజించి యున్నాఁడు బాల్యము నుండియు నాది శీఘ్రకోపోద్రేకము నొందెడు స్వభావము. కార్యార్థమయి యొరుల వేఁడు వారికుండవలసిన యోర్పుగాని, వారిననుసరించి తిరుగవలసిన యడఁకువగాని నాయొద్ద లేవు. మొదటినుండియు నేను శాసించుటకెకాని యాచించుట కలవాటు పడిన వాఁడనుగాను.''

ఈ పై వాక్యాలు ఆయన స్వభావానికి దర్పణం వంటివి "నిండు మనంబు నవ్యనవనీత సమానము, పల్కుదారుణా ఖండల శస్త్రతుల్యము ...'' ఈ సూక్తి పంతులుగారి జీవితానికే అన్వయిస్తుంది ఏ విషయమయినా తనకు "న్యాయం కాద"ని తోచినప్పుడు ఎదుటి వారిని ఆయన నెమ్మదిగా సమాధానపరచక పెద్దగొంతుకతో తన మనములో విషయాన్ని నిర్మొహమాటంగా ముఖంమీదే కుండ బ్రద్దలు కొట్టినట్టు చెప్పినా, అవసరం వచ్చినప్పుడు అవతలివారు అడగక పోయినా తానై వెళ్ళి వారి కష్టాలలో ఆదుకోకుండా ఉండలేక పోయేజాలి గుండె ఆయనది

ఇతరుల మెప్పుకోసం, ముఖ ప్రీతి కోసం ఆయన ఏ పనీ చేయలేదు. విశ్వాసం లేని విషయంలో విశ్వాసం లేనట్టే మాటల్లోనే కాక చేతల్లో కూడ దానిని చూపడం ఆయన స్వభావం. ఛాందసుఁడుగా ఉన్నప్పటి నుంచీ దుర్నీతి మూఢాచారాల పట్ల ఆయనకు సహజద్వేషం ఉండనే ఉంది. వీరేశలింగం విప్లవవాదిగా మారిన తరువాత అవి ఏ విధంగా పరాకాష్ఠనందాయో మనం చూడవచ్చు.

ఏక కాలంలో ఎన్నెన్నో సంఘ సంస్కరణ సమస్యల పరిష్కారంలో తలమునకలుగా కృషి చేస్తున్న పంతులుగారు, ఆది నుండి తెనుగు భాషాభివృద్ధి పట్ల అభిలాష ఉన్నా 'తృప్తికరంగా కృషి చేయలేక పోయాను' అని ఆవేదన పడేవారు.

తెనుగు సాహిత్యంలో నూతన ప్రక్రియల కెన్నింటికో ఆయనే శ్రీ కారం చుట్టారు. నవల, ప్రహసనం, ఉపన్యాసాలు, స్వీయ చరిత్ర, అనువాద నాటకము, వచన ప్రబంధం, స్త్రీల కథలు, జీవిత చరిత్రలు, కవుల చరిత్ర, సాహిత్య గ్రంథములు.... ఇన్నింటికీ పంతులు గారే ఆద్యులు.

అయితే ప్రథమ ప్రయత్నాలెప్పుడూ ప్రథమ ప్రయత్నాలే. అవి దోషబహుళాలయి ఉండడం స్వాభావికం. మన అభివృద్ధి, చేసిన తప్పులను బట్టే కాబట్టి తన రచనలు తర్వాతి వారి గురుతర పుస్తక రచనకు కొంత తోడ్పడ వచ్చుననే విషయాన్ని ఆయన ప్రకటించారు. నూతన ప్రక్రియలకు తానే మార్గ దర్శకుడననే గర్వం వారికి ఉండాలి. ఆయన వాక్యాలలో అహంకంటె వినయమే అధికంగా కనిపిస్తుంది.

## ప్రచార సాహితి

పాండిత్య ప్రకర్షను ప్రదర్శించే పుస్తకాలు కొన్ని వ్రాసినా సంఘ దురాచార సంస్కరణకూ, పరిశుద్ధ ధర్మమత ప్రకటీకరణానికీ అవకాశం లభించినప్పుడల్లా ఆయన తన రచనల్లో చోటు కల్పిస్తూనే వచ్చారు. ఆయన జీవితంలో ఎక్కువ భాగం సంఘ సంస్కరణకే వినియోగ పడింది. అదే ఆయన ప్రధానరంగం. సాహిత్యం దాని ప్రచారానికి మాత్రమే!

అందుకే తన ప్రచారానికి అనువుగా కొన్ని నూతన ప్రక్రియలను, ముఖ్యంగా వచనాన్ని ఆయన అధికంగా ఆదరించ వలసి వచ్చింది కొన్ని సందర్భాలలో సాహిత్యం ఆయన కించు మించు ప్రచారానికే వినియోగ పడిందన్నా దోషంలేదు. ప్రచారానికి సాహిత్యం ఎంతటి బలవత్తరమయిన సాధనమో వీరేశలింగం గారి రచనలు నిరూపిస్తాయి.

భాషలో కొంత 'స్వేచ్ఛ'ను కూడ ఆయన అంగీకరించాడు. గ్రంథాలను సాధారణంగా సులభ శైలిలో రచించాలనీ; విషయానుగుణంగా ఉచిత రీతిని గ్రామ్య భాషను సహితం గ్రంథాలలో వ్రాయ వచ్చుననీ కొంత పరిధిలో వ్యావహారిక భాషను కూడ పంతులుగారు సమర్థించారు.

ఎక్కువ రచనలు ప్రచారం కోసం తాత్కాలిక ప్రయోజనం కోసం వ్రాయడం చేత.అందులో కొన్ని విషయ గౌరవంతో జీవించ వలసినవే తప్ప సాహిత్య ప్రతిష్ఠ సమకూర్చుకోలేదు.

''నేనేర్పరుచుకున్న భాషాభివృద్ధికి మార్గము తెనుఁగు భాషలో మృదువైన సులభ శైలిని సలక్షణమైన వచన రచన చేయుట. దేశాభివృద్ధి మార్గము జనులలోఁ గల దురాచార దుర్వర్తనములఁ బాపియు వృద్ధి పద్ధతులను జూపియు వారి నధిక నీతిమంతులనుగాఁ జేసి దేశము నున్నత స్థితికిఁ దెచ్చుటకయి శక్తి వంచన లేక పాటుపడుట...."

ఇదే లక్ష్యంగా పంతులుగారి సాహిత్య కృషికొనసాగింది. తన జీవిత కాలంలో విజయ పరంపరలను కళ్ళ చూసి కన్నుమూసిన ధన్యజీవి పంతులుగారు.

జీవితంలో మనిషి అంతకంటె కోరుకోవలసిందేముంది? ఆయన సాంఘిక సారస్వత సంస్కార సవ్యసాచి !!



శమము దమము లేమి జనులకు హింస నొ
నర్చుఁగాన ధరణినాథ వినుమ
హింస శమ దమములు హృదయంబునకు నెప్డు
నలవడంగఁ జేఁత యండ్రు బుధులు.

— శాంతి పర్వము.

* * *

పదను దివిసిన కస్తూరి, ప్రాఁచియలరు,
పాయఁబాఱిన కూ... నీర్వటుమడుగు
గళితమణియగు సొమ్మునై కానఁబడియె
దుర్విదగ్ధుండు గౌరవ దూరుఁడగుచు.

పాండురంగ మాహాత్మ్యము

# అవధాన విద్య

— విద్యాదేవ కులపతి

ఒక ప్రత్యేక విషయమునందు, నిర్దిష్ట వస్తువునందు హెచ్చరిక, శ్రద్ధ కలిగియుండుట అవధానము. ప్రాచీన కాలమున ప్రధానముగా వేదావధానము జరిగెడిది. కంఠస్థము చేసిన వేద విభాగములలో ఘన, జట చెప్పుటలో ఎక్కడ ఎట్లు అడిగిన ఆ విధముగా చెప్పుట ఆ వేద పండితుని అఖండ ధారణకు చిహ్నముగా గుర్తింపబడెడిది. కాలము గడచిన కొలది కావ్య ప్రపంచములో కూడ ఆ రీతి ప్రవేశించినది కాని చాల కాలము దాక దాని కొక నిర్దిష్టమైన రూపము ఏర్పడలేదు. ఆశువుగా అడిగిన దానిపై అడిగినట్లు శ్లోకములు చెప్పుట, సమస్యా పూరణము భారత పండితులలో ఒక విచిత్ర శక్తి సంవిధానముగా చిరకాలమునుండి భావింపబడుచున్నది. ఈ సంప్రదాయములో నిర్దుష్టమైన ఆశుధారా కవితకు ప్రధాన స్థానము కలదు. కవి తనకు కలిగిన అనుభూతిని రసానంద స్వరూపమును తాను భావించి ఇతరులననుభావింప జేయుటకు వెలువరించిన హృదయ పరవశీకృతా కృతి తత్తదావేశోద్రేకములను బట్టి ఆశువుగా పరిణమించును. అట్లు పరిణమించినవే వాల్మీక్యాదుల కావ్య సృష్టి విశేషములును. అయితే ఇక్కడ అవధానములలో అట్లు కాదు. అవధాని తనకు స్వయముగా ఉత్పన్నముగాని సహజతత్వభిన్నమైనదైనప్పటికిని పృచ్ఛకుని అభిమతానుసారముగా ఆవేశమును కల్గించుకొని కల్పించుకొని పలుకుట జరుగును. కావున వాల్మీక్యాదులలోగాని, లేక స్థిర కావ్య రచనలోగాని లేక తనకు తానై కవి భావించునది, భావించి పలుకునది సహజాశువు. సభా వేదికలపై కాని మరొక చోటగాని ప్రాశ్నికుల అభిమతానుసారముగా పలుకునది కృతకాశువు. సహజతలో సామాన్యముగా రమణీయత సిద్ధము. కృత్రిమతలో సాధ్యము. కాని మొత్తము మీద రెండును కవి సమర్థతపై ఆధారపడి యుండును ఒకటి చెప్పక తప్పదు సమర్థుడైన కవి విషయములో కృత్రిమముగా ఉద్రేకము సృష్టించుకొని చెప్పిన కవితకన్న సహజముగా ప్రకృతి సిద్ధమైన అనుభూత్యావేశముల చేత భావింపబడిన రచన రమణీయ తరముగా ఉండుననిన అది సత్యదూరముగాదు.

మానవుడు కొన్నివిషయములలో సహజతకన్న అసహజతను ఎక్కువగా ఆనందించును. అందరు కాళ్ళతో నడచుట సహజమైనది. ఎవడైన తలతోనో తలక్రిందుగానో నడచిన జనులు వేలము వెఱ్ఱిగా చూతురు. విచిత్రమైన శారీరక విద్యలు సర్కసు వంటివి ఆకర్షణకు మూలములు. అట్లే మానసిక రీతిలో చూచిన ఇంద్రజాల విద్యలును. మానవుడు తనకు సాధ్యముగాని విషయములను విచిత్రరీతి కలిగిన వానిని మరొకడు చేసి చూపిన చాల సంతోషించును. అట్లే అవధానాదులును ఒక దుస్సాధమైన ప్రక్రియను, అసామాన్య బుద్ధి శక్తితో ప్రదర్శించునప్పటికి జనులకు ఏదో అనుకొనని అనుభూతి కలిగి తద్వారా హృదయ చలనము కలుగును. అట్లు చేయు వశీకరము అవధానములో ఉన్నది.

ఇక అవధాన స్వరూపమును పలుకు ముందర దానికి కావలసిన విశిష్టతలు భావనకు నిల్పెదను. ఈ నాటి కవితా లోకములో సంభావింపబడుచున్న రీతికి—తీవ్రమైన ధారణా శక్తి, పాండిత్య విశేషము ఆశుధారా కవిత, సమయస్ఫూర్తి ప్రధానమైనవి. ఆయా విధానములలో ఒక స్థితి నందుకొని ప్రాచీన కాలము నుండి దీనికి ఒక గౌరవ స్థానమును తెచ్చిన కవు లనేకులున్నారు. సమస్యాపూరణాదులు కాళిదాసాది కవుల కాలమునుండి ప్రపంచ మెరుగును. కాని

తెలుగు దేశములో ఈ అవధానమున కొక నిర్దిష్ట స్వరూప మేర్పడినది. ఔత్తరాహులుకాని, మిగత దాక్షిణాత్యులుగాని ఈ రీతి అవధానమును ఎరుగరు అనుట అసత్యము పలుకుట కాదు. దాక్షిణాత్యుల అవధాన మొకటి కలదు. దానిలో ఏవో పనులు చేయుట కలదు (అష్టావధానమైన ఎనిమిది, శతావధానమైన నూరు....ఇట్లు సంఖ్యను బట్టి) తెలుగు వారి అవధానము కవితావధానము. దీనిలో కవిత్వము ప్రధాన స్థానము నాక్రమించును. ఇట్టి అవధానములు తెనుగు సీమలో బయలుదేరి తెలుగువారివలన ఇతర ప్రాంతముల ప్రచారము పొందినవి. భట్టుమూర్తి కాలము నాటికి ఒక స్వరూపము వచ్చుచు న్నట్లుగా కొంతవరకు చూడగలము. అతడు శత లేఖినీ పద్య సంధానధౌరేయుడు, ఘటికాశత గ్రంథ కరణధుర్యుడు, బహుపద్యసాధిత వ్యస్తాక్షరీధురీణుడునని విన్నాము. ఇట్లే చరిగొండ ధర్మన యొకడు అవధాన నిపుణుడని వినబడుచున్నది. తరువాత శ్రీ మాడభూషి వెంకటాచార్యులవారు, శ్రీ దేవులపల్లి సుబ్బారాయ శాస్త్రి, తమ్మన్న శాస్త్రిగార్లు అరుదైన ఈ విద్యకు పట్టు గొమ్మలై యుండెడివారు. తరువాత శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు ఈ యవధానమును ఆంధ్ర దేశములోని నలు మూలలకు వ్యాపింపజేసిరి. వారి సంచార ప్రభావముతో ఆంధ్ర సీమలో పలువురు అవధానులు బయలు దేరుటయే గాక కవితా విధానమున మహోత్సాహరీతులు వివిధములుగా విజృంభించినవి శ్రీ కొప్పరపు సోదరకవులు, శ్రీ వేంకట రామకృష్ణ కవులు మొదలగువారు తెలుగునాడులో అవధానాకు కవితలతో సుప్రఖ్యాతులైనవారు. ఇదేసమయమున శ్రీ కావ్యకంఠ గణపతిమునులొకరు కేవల సంస్కృతావధానములు చేసినవారు. నవద్వీపాది పండిత పరిషత్తులలో వీరి నామము కీర్తి చెంది ఆంధ్ర ప్రదేశమునకు ఎనలేని గౌరవముచేకూర్చినది. మహాతపస్వులైన వీరి రచనలు (ఉమాసహస్రము, ఇంద్రాణీ సప్తశతి, చండీత్రిశతి మొ॥ అనేకములు గలవు) అత్యంత రమణీయములు. శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవుల శిష్యులలో అనేకులు అవధాని వర్యులుగలరు. శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు, శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారు, శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మొ॥ వారు. అట్లే మరియొక విద్యాపీఠము శ్రీకాశీకృష్ణాచార్యుల వారిది. వారు, వారి శిష్యులు శ్రీ పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులవారును అవధాని లోకమున సుప్రసిద్ధులు. ఇట్లే దేశమున అనేకులు ఇంకను శ్రీ గాడేపల్లి వీరరాఘవ శాస్త్రిగారు శ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. శ్రీ మిన్నికంటి గురునాథ శర్మగారు, శ్రీ పోతరాజు లక్ష్మీనరసింహకవిగారు, మొదలగు విద్వత్కవులెందరో అవధానములు చేసినవారు కలరు. కాని రానురాను ఈ విద్యక్షీణించి ప్రస్తుతము నామ మాత్రముగా మిగిలినది. అవధానములు చేయువారు తక్కువ, ఆదరించువారు తక్కువగా అవధానములకు జన్మస్థానమైన ఈ తెలుగు సీమలో కొంత కాలమునకు ఆపేరే మరపునకు వచ్చు పరిస్థితి వచ్చుననిపించుచున్నది. ఈనాడు అవధానులుగా చాల కొద్ది పేర్లు మాత్రమే వినబడుచున్నవి. శ్రీ యుతులు పోతరాజు పురుషోత్తమరాయకవి, కొప్పరపు సీతారామ ప్రసాదకవి (కొప్పరపు సోదరకవులలో అగ్రజులగు శ్రీ వేంకట సుబ్బరాయకవిగారి పుత్రులు), బులుసు వేంకట రామమూర్తి, గాడేపల్లి కుక్కుటేశ్వర రావు మొ॥ వారు అవధానములు చేయుచు పేరుగాంచుచున్నారు. ఇంకను కొందరు అక్కడక్కడ ఉండవచ్చును. ఏది ఎట్లైనప్పటికి అవధాన ప్రమాణములు కొంత పడిపోవుచున్నట్లుగా కన్పించుచున్నది.

అవధానములు కొన్ని విభాగములుగా విభజింపవచ్చును. అష్ట, శత, సహస్రావధానములు ఆంధ్ర దేశమున విబుధులెరిగిన సంవిధానములు. ఒక్కొక్క దానిని వీలైనంత వరకు వివరింతును.

## అష్టావధానము

దీనిలో ఎనిమిది విధములైన పనులయందు అవధానము చూపవలసి యుండును. కాని ఈ ఎనిమిది ఒక స్థిరమైన పథకము ననుసరించి లేవు. ఒక్కొక్క కవి ఒక ఎనిమిది పనులను తన కిష్టమైన వానిని నిర్ణయించుకొనును ఉత్సాహమును బట్టి అంతకెక్కువ పనులతోను అవధానము జరుపుట కలదు.

(1) వర్ణన — ఈ శీర్షిక క్రింద అవధాని యిష్టము, సభాసదుల కోరిక కాల నియమము ననుసరించి ఎన్నియైన నుండ వచ్చును. పృచ్ఛకులు ఛందోనియమమును వస్తువును యిచ్చుట జరుగును. అవి కాక కొన్ని పర్యాయ

ములు కొన్ని కఠినతర నియమముల నుంచుటయు కలదు. అవధాని యిష్టానిష్టములపై వాని పూర్తి ఆధారపడియుండును.

(2) సమస్య-ఒక అర్థరహితమో, దురర్థకమో ఐన వాక్యము నొక దానిని ఇచ్చిన (అది సామాన్యముగా పద్యములో నాలుగవ పాదమై యుండును) అది సరియగు నట్లుగా పూరించుట.

ఉదా:- ప్రాగ్భాగంబున నస్తమించె రవియున్ ప్రత్యూష కాలంబునన్

దృగ్భాషానుతమై ఉషోగ్రహణ మెంతే పూర్ణమైరాగ-భూ

దిగ్భాగంబుగనంధ కార పటలీ ధిక్కారముల్ రేగెనా

ద్రాగ్భుగ్నాగ్రహ విగ్రహాండగు మహా రాహుగ్రహ గ్రస్తుడై

ప్రాగ్భాగంబున నస్తమించె రవియున్ ప్రత్యూష కాలంబునన్

(నా అవధాన మొకదాని నుండి)

(3) దత్తపది:- నాలుగు పదములను ఇచ్చి వానిని నిర్దిష్ట స్థానములందుంచి పద్యము చెప్పవలెను. కొన్నిసార్లు విచిత్ర నియమములు కోరుటయు కలదు. పృచ్ఛకుల సంతృప్తి కొరకు ఆ కఠిన నియమములనుసరించి చెప్పుట జరుగుచుండును. నా అనుభవములలోని వానిలో ఒక దాని నుదాహరింతును.

ప్రశ్న:- రాముని, భీముని, కాముని, సోముని అను పదములను పద్యపాద ప్రారంభము లందుంచవలెను. భాగవతార్థము రావలెను, ఆ పదములకు సామాన్యముగా స్ఫురించు అర్థము రారాదు. అదికంద పద్యమై యుండవలెను. (విజయవాడ రేడియో అవధానము) ఇన్ని నియమములు మామూలుగా అంగీకరింప రాదు.

పూర్తి— కం॥ రాము నినున్ భంజింపగ

కాము నితాంతారి భావ కలితుల మరిచే

భీము నిగితిమని దుర్వా

సోముని బయ్యంయరీషుస్తుతి గావించెన్

అరి=చక్రము

(చక్రము వెంట బడగా దుర్వాసుడు గర్వము వీడి అంబరీషుని ప్రార్థించుట దీనిలోని భావము)

(4) న్యస్తాక్షరి— దీనిలో ఛందమును, వర్ణ్య వస్తువును ఇచ్చి ఆ పద్యములో ఏ స్థానములోని అక్షరముగా వలసిన దానిని అడుగుదురు.

ఉదా:- శివధనుర్భంగము. అనుష్టుప్ (నా గుంటూరు అవధానము)

రామ స్తుతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1<br>స | 2<br>దా | 3<br>శి | 4<br>వ | 5<br>ధ | 6<br>ను | 7<br>ర్భం | 8<br>గ |
| 9<br>క | 10<br>ళ్యా | 11<br>ణ | 12<br>మ | 13<br>య | 14<br>మా | 15<br>న | 16<br>సం |
| 17<br>వం | 18<br>దే | 19<br>హం | 20<br>రా | 21<br>ఘు | 22<br>వం | 23<br>రా | 24<br>మం |
| 25<br>సీ | 26<br>తా | 27<br>భా | 28<br>వ | 29<br>మ | 30<br>నో | 31<br>హ | 32<br>రం |

పై విధముగా తాము కోరిన ఛందస్సుకు సరిపోవునట్లు గళ్ళుగా గీసికొని ఒక్కొక్క అక్షరము వరుస క్రమము తప్పించి అడుగుదురు

(5) వ్యస్తాక్షరి:- కొన్ని అక్షరములుగాని, పదములుగాని ఒక వాక్య విభాగము గాని పరిగ్రహించి విభజించి వరుస క్రమమును తప్పించి అవధానము జరుగుచున్నంత సేపు కాగితము ముక్కలపై వ్రాసి ఇచ్చుచుండవలెను. ఇచ్చిన కాగితపు ముక్క అవధాని చూడగనే తిరిగి తీసికొందురు. ప్రతి కాగితపు ముక్క మీద ఒక అక్షరమును లేదా పదమును మరియు అది ఎన్నవదియో ఆ అంకె యుండును.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| హృ | ద | యాత్ | య | ది | వి | ర్యా | సి |
| 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 |
| పౌ | రు | షం | గ | ణ | యా | మి | తే |

(నా హైదరాబాద్ రేడియో అవధానము నుండి)

అట్లు విడి విడిగా ఇచ్చిన వానిని గుర్తుంచుకొని అవధానాంతమున వరుస ప్రకారము అప్పగించవలెను.

(6) నిషిద్ధాక్షరి:- వర్ణ్య వస్తువు, ఛందస్సు నిచ్చి ప్రత్యక్షరమును నిషేధించుచుండగా పద్యముగాని శ్లోకముగాని చెప్పుట.

(7) పురాణము- ఒక పండితుడు ఏదే నొక పురాణము నుండి కొన్ని ఘట్టములు చదువగా వ్యాఖ్యానము చేయుట.

(8) ఆశు కవిత- అడిగిన వానిపై అడిగినట్లెల్ల పద్యములు చెప్పుట

(9) ఆకాశ పురాణము- ఏదైన నొక కథ నిచ్చిన యెడల దానిని పద్యములలో ఒక రసవంతమైన చమత్కార స్వరూపము నిచ్చి పలుకుట

(10) వ్యర్థ ప్రసంగము లేక అప్రస్తుత ప్రశంస- లౌకిక విషయములు సయుక్తికముగ సచమత్కారముగ అడిగిన వారితో భాషించుట

(11) కావ్యోక్తి- విద్యార్థి కొక్కనికి శ్లోక క్రమముగా పాఠము చెప్పుట-

(12) శాస్త్ర చర్చ— పండితులతో అభిమాన శాస్త్రమున చర్చ జరుపుట.

(13) చతురంగ ఖేలనము - చదరంగ మాడుట.

(14) చీట్ల పేక— అదియును కాలాతి క్రమణము జరుగకుండ ఆడుట

(15) ఘంటా గణనము— అనేక పర్యాయములు వేరువేరు సంఖ్యలుగ కొట్టబడిన గంటలను గుర్తుంచుకొని అవధానము చివర చెప్పుట.

(16) పుష్పగణనము— శరీరముపై వేయ బడిన పూలను లెక్కించి చెప్పుట.

(17) గణితము— తేదీ యిచ్చిన అది ఏ వారమో చెప్పుట. ఇట్లే ఇంకను దత్తాక్షరి (దత్తపదివంటిదే పదముల బదులు అక్షరములుండును) అనేక గణితరీతులు మొదలగునవి కలవు

ప్రధాన విషయము—సమస్యలు, వర్ణనలు మొదలగునవన్నియు ఒక్కొక్క సారి ఒక్కొక్క పాదము చొప్పున చెప్పబడును. అన్నియు మొదటి పాదముచెప్పిన తరువాత రెండవ పాదము ప్రారంభించుట జరుగును. ఇట్లు నాలుగు పాదములు చెప్పబడిన తరువాత అన్ని విషయములు సక్రమముగా ధారణ చేసి ఒప్పజెప్పిన యెడల అవధానము పూర్తియగును. పైన చెప్పిన 17. 18 విషయములలో, ఏ ఎనిమిది నైనగ్రహించి చేయుట అష్టావధానము. సమస్య. వర్ణన, దత్తపది, వ్యర్థ ప్రసంగము, నిషిద్ధాక్షరి మొ॥ కొన్ని సామాన్యముగా నందరు అవధానులు గ్రహింతురు, మిగిలినవి ఎవరి ఇష్టమును బట్టివారు గ్రహింతురు.

శతావధానము—దీనిలో అష్టావధానములోని విషయములుండవు. వర్ణనలు, సమస్యలు మాత్రమే ఉండును. అయితే నూర్గురకు ఒక్కొక్క పాదముచొప్పున నాలుగు పాదములు చెప్పి చివరకు మొత్తము ఒప్పజెప్పవలెను.

సహస్రావధానము—దీనిలో కొంత కవిత్వము కొంత ఇతరము ఒకవేయి వస్తువులను గ్రహించి ధారణచేసిన అనంతరము. కొన్నిరోజుల తర్వాత ఎన్నవ వస్తువు ఏదో చెప్పుట లేదా ఆ వస్తువుపై పద్యము చెప్పుట దీనిలో ఎక్కువగా నుండును. ఇట్లే ద్విసహస్రము, పంచ సహస్రము మొ॥ గా చేయుదురు. ఏదైన అవధానమునకు ధైర్య స్థైర్యములు శాస్త్ర జన్యజ్ఞానము ఆశుధార, సమయస్ఫూర్తి ప్రధానము. విద్వత్కవుల శక్తికి పరీక్ష. సభ్యుల కానందదాయకము. ఇట్టి అవధాన విద్యకు సరియైన పోషణ ఆదరము దేశమున లభించు నట్లుచేయుట ఆంధ్ర దేశమునకు గౌరవము పెంపొందించుట.

---

నాగరికతకు నికషం ఒక దేశం తయారుచేసే మనుషుల స్వభావమే కాని జనాభా లెక్కలు కాని నగరాల పరిమాణం కాని పంటలు కాని కావు

— ఎమర్సన్

# గ్రీష్మము

— అన్నాప్రగడ శ్రీరామమూర్తి

ఈ గ్రీష్మమ్ము పరంతపమ్మయిన దంతేగాదు బాహ్యాన శీ
ర్షగ్రై వేయలు గేహసీమల నసూర్యం పశ్యలై పూరుషుల్
వ్యగ్ర శ్రాంతిని తారు మారయిరి సూర్యాటో పమీషించియా
యుగ్ర శ్రీకి భయం పడెన్ సకల మోహో! భూత జాలమ్మిలన్-

లోకంబందలి జీవకోటి తనువుల్ పోగాల మంద్రైనయ
ట్లాకుల్ రాలెను పండి యెండియు కవోష్ణా మంద వాతాహతిన్
భూకాంతా మణియున్ జ్వరం పడెను— బాబూసీ ప్రతాపాగ్నికిన్
మాకాళుల్ పెను బొబ్బలెత్తినవి పోమధ్యాహ్న మార్తాండుఁడా!

నీ కున్ సారధి కుంటివాఁడని ప్రజానీకంబు భావించుగా
నీ కన్పింపదు నీరధమ్ము నడకన్ లేశమ్ము దోషమ్ము నీ
వాకాశంబున నాఘ మేఘములపై నారీతి పర్వెత్తగా
నీ కాలంబున మాడి మాడి పెనమయ్యెన్ కాశ్యపీఖండమే॥—

ఓ మార్తాండ మహాప్రభూ! భవదఖండోద్దండ శౌర్య ప్రబల్
మామీదన్ గనిపింప జేసెదలే బ్రహ్మాస్త్ర ప్రయోగం బహో
స్వామీ! పిచ్చుక మీదనా యసలు విశ్వాసమ్ము నీకున్నదా?
నీ మంత్రంబు పఠితుమే కొలుతుమే నిన్నేయుపాసింతుమే !

ప్రాముఖ్యంబు గతించె వెల్గున- కకాల స్నానముల్ చేయుచు
న్నామీ స్వేద మహా ప్రవాహములలో-నానా విధానమ్ములన్
వైముఖ్యమ్ము బహిర్గతమ్మగును నీపై దాక్షిణాత్య ప్రజన్
మామేల్గోరి యొకింత తగ్గుము ప్రభూ మార్తాండకై మోడ్పెదన్

గేహాళి దాటనీయనిది గ్రీష్మము—స్వేదములూట లూరుమా
దేహములందు- నిద్దుర కఠినములై కనులుండ- మక్షికల్
దాహము దీర్చుకొంచు బహూధా నిదురన్ కడుభంగపెట్టు—స
ర్వోహలు నీపయిన్ నిలుచు చున్నవి తాపని వారణార్థమై.

నీదు ప్రచండ దీప్తికర నిర్భర దుర్భర బంధమందునే
దోదురవస్థ పట్టినటులున్నది నీ ప్రియురాలు పద్మినీ
మోదము కారకత్వమని ముఖ్యముగా వచియింత్రునీకు నీ
మేదినిపై భవత్కిరణ మేదుర తీవ్రత మాన్పు భాస్కరా!

ఈ భువనాంధ కారమునకీ వొక యారని దీప మంచునీ
పైభయు భక్తులున్న ప్రజ వందన మీయగదుర్ని రీక్ష్యతే
జోభరితుండవైన నిను జూచి భయంబునె చూపి వెళ్లినా
రోభగ వంతుడా తెలియ కున్నది వారి యెడంద భక్తియున్-

వాసరముల్ సుదీర్ఘములు భాస్కర నీకర చండిమమ్ముతో
వాసముదుష్కరమ్మను ప్రవాసము ప్రీతి కరమ్ము నయ్యెమా
కోసెగగాడ్పు దెబ్బలకు నీ కొలుముల్ జ్వలియించు వేళజ్యో
త్స్నాసము పేత శీతలుడు చంద్రుని గోరుదు మీయ హాస్పలన్

రాత్రులపైని వాంఛదిన రాజున కెంతయ గౌరవమ్మొ యీ
మాత్రమెఱుంగవా సకల మానవులున్ నిను నమ్మలేక యీ
ధాత్రిని నీదు ఛాయ నెదధ్యానము చేయుదురామె శీతల
ఛ్ఛత్రము పట్టునంచుదివిషన్మహనీయుడవౌ ప్రభాకరా!

——:0:——

సత్యం సంపూర్ణమైనది. దానినెవ్వరూ మార్చలేరు. అభివృద్ధి పరచలేరు కూడా. **సత్యాన్ని నమ్మి జీవించు.**

**— బుద్ధుడు.**

గ్రామసుల రేడియో గోష్ఠి:

# జొన్నకు వచ్చే తెగుళ్లు-వాటి నివారణ

— డా॥ ఏ. అప్పారావు

ప్ర:- అప్పారావుగారూ. జొన్న పైరువేసే ఋతువు దగ్గరపడుతోంది. జొన్నకు పట్టే కొన్ని ముఖ్యమైన తెగుళ్లనుగురించి, వాటి నివారణ గురించి కొంచెం మనరైతు సోదరులకు తెలియజేస్తారా?

జ:- తప్పకుండానండి. జొన్న పంటకు సుమారు 10 తెగుళ్లదాకా తగులుతాయి.

ప్ర:- అబ్బో పదితెగుళ్లే?

జ:- ఐతే పది తెగుళ్లలో మూడు నాలుగు తెగుళ్లు మాత్రమే ప్రమాదకరమైనవి మిగిలిన తెగుళ్లు పంటనెక్కువగా నష్టపరచవు. అందువలన వాటిని గురించి భయపడనక్కరలేదు.

ప్ర:- ఐతే ఆ ప్రమాదకరమైన తెగుళ్లేవో చెప్తారా.

జ:- అలాగేనండి. వీటిలో ముఖ్యమైనవి కాటుక తెగుళ్లు. ఈ కాటుకతెగుళ్లలో రెండు రకాలున్నాయి. గుండు కాటుక తెగులు. ముళ్లకాటుక తెగులు.

ప్ర:- యీ వ్యాధుల లక్షణాలు చెపుతారా.

జ:- ఈ వ్యాధి లక్షణాలు జొన్నకంకి వేసినపుడే కనపడుతాయండి.

ప్ర:- అంటే యీ వ్యాధి కంకికి పడుతుందంటారా?

జ:- కంకికే పడుతుంది. కాని మొక్క మొలకెత్తినప్పటినుండి వ్యాధి చెట్టులోకంటి ఉంటుంది, ఐతే చెట్టుకేమీ హానిచేయదు. కంకివేసినప్పుడు మాత్రం ఆ కంకిలోని గింజలన్నీ నల్లటికాటుక ముద్దలులాగా తయారవుతాయి అంటె ఆ కంకిలో మనకు ఒక్కగింజ కూడా దక్కదన్నమాట. ఒక రకం కాటుక తెగుళ్లకు యీ నల్లటి కాటుకముద్దలు గట్టిగా గుండ్లుగుండ్లుగా ఉండి తేలికగా పగలవు. రెండవరకపు కాటుక తెగుళ్లలో యీ గుండ్లు పగిలిపోయి లోపలనుండు ముళ్లు మనకు కనపడుచుండును. ఇట్టి కంకి నల్లగాను, ముళ్లుగానూ మనకు కనపడుతుంది.

ప్ర:- అసలీ తెగులు ఎందుకు తగులుతుందండీ.

జ:- ఇది ఒక బూజు తెగులండి. శిలీంధ్రములని కూడా అంటారు, ఇంగ్లీషులో ఫంగస్ అంటారు. యీ ఫంగస్ పేరు స్ఫాసలోధికా, యీ రెండు జబ్బులు కూడా యీ స్ఫాసలోధికా అనే ఫంగస్ వల్లనే కలుగుతాయండీ.

ప్ర:- మరి యీ వ్యాధికి మందేమిటండీ?

జ:- యీ వ్యాధినుండి తప్పించుకోవాలంటే అసలు విత్తనము పెట్టకముందే జాగ్రత్తతీసుకొనవలెనండీ.

ప్ర:- అదేమిటండోయి, అసలు చెట్టు పుట్టకముందే చెట్టుకు వచ్చేతెగులు నయంచేయాలంటారు.

జ:- చెప్తాను వినండి. అసలు యీతెగులు విత్తనము వేసినప్పుడే ఆరంభమవుతుంది. ఆ బూజు అంటే ఫంగస్ అని చెప్పానే, అది స్పోర్సు అంటే దాని విత్తనము అన్నమాట, అవి గింజనంటే పెట్టుకొని ఉంటాయి. గింజ మొలకెత్తినతోడనే ఆ బూజు కూడా మొలకెత్తుతుంది. ఆ తరువాత కంకి వేసినపుడు వ్యాధి లక్షణాలు కనిపిస్తాయని చెప్పాను కదా. కాబట్టి యీ వ్యాధి నివారణకు విత్తనము చల్లకముందే జాగ్రత్త పడాలన్నమాట

ప్ర:- అది ఎట్లాగంటారు?

జ:- చాలా సులువైనది. చవుకైనది ఒక మంచి మార్గ మున్నదండీ మనము చల్లదలచిన విత్తనాలలో కొంచెం గంధకము కలిపి వాటిని బాగా కలియపెట్టి నట్లయితే ఆ బూజు స్పోర్సు చచ్చిపోతాయి. ఇక యీ తెగుళ్లు తగిలే భయంలేదు

ప్ర:- చాలా సులువైన మార్గం చెప్పారే. మరి కొంచెం వివరంగా చెప్పండి.

జ:- అడ్డెడు (అంటే 4 శేర్లన్న మాట) జొన్న విత్త నాలను తీసికొని ఒక మట్టి పాత్రలో పోసి, ఒక తులం గంధకము దానిలో వేసి ఆ పాత్ర మూతికి ఒక గుడ్డ కట్టి పది నిమిషాల సేపు ఆ పాత్రను బాగా కుదిలించాలి. అంటే ఆ గంధకము జొన్న గింజలకు బాగా పట్టాలన్నమాట. అట్లా బాగా కుది లించిన తరువాత ఒక గంటసేపు అలాగే ఉంచి ఆ విత్తనాలను చల్లవచ్చు. ఇంత తక్కువ శ్రమ తోనూ, తక్కువ ఖర్చుతోనూ ప్రమాదకరమయిన యీ రెండు కాటుక తెగుళ్లను నివారించవచ్చునన్న మాట.

ప్ర:- ప్రతి రైతు ఈ పద్ధతి అవలంబిస్తే కాటుక తెగుళ్లు తగలవంటారు

జ:- తగలవండీ. అంతేకాదు, యీ వ్యాధికి యీ మందు తప్ప వేరే ఇంతవరకూ మందేలేదండి. ఆ మధ్య కొందరు రైతులు మాకు ప్రశ్నలు పంపారు. గుర్తున్నదాండి. మా జొన్న పైరుకు కాటుకతెగులు తగిలింది ఏమి చేయమంటారు. అని, కాటుక తెగులు తగిలిన తరువాత చేసేదేమీ లేదు. చూస్తూ ఊరుకోవటం తప్ప ఆ తెగులు తగలకుండా చూడాలి అంటే పైన చెప్పినట్లు విత్తనాలు చల్లక ముందు గంధకం కలపాలి. లేకపోతే చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకున్న సామెత అవుతుంది.

ప్ర:- కాటుక తెగుళ్ళు కాక ఇంకా ఏఏ తెగుళ్లు తగులు తాయండి జొన్నకు.

జ:- ఆ జొన్నకు పట్టే వాటిలో మల్లె ఒకటి మహా ప్రమాదకరమైనదండీ.

ప్ర:- ఆ ఆ మల్లె అని తెల్లటి పూలు పూస్తూ జొన్న మొక్కల మొదళ్ళ దగ్గరే పెరుగుతుంటుంది. అదే నాండి.

జ:- అవునండి, అదే.

ప్ర:- మల్లె అంత ప్రమాదకరమయినదంటారా.

జ:- కొన్ని జిల్లాలలో మల్లెవల్ల జొన్న పంటకు చాలా నష్టం కలుగుతూ ఉందండీ. గుంటూరు ప్రాంతంలో పునాస జొన్నకు, కర్నూలు జిల్లాలోని జొన్న పంటకు మల్లెవల్ల విపరీత నష్టం కలుగుతూంది.

ప్ర:- మల్లె దానంతట అదే నేలలో పెరుగుతున్నదిగదా. అదే జొన్నకు అంత నష్టాన్ని ఎట్లా కలుగ జేస్తుందండీ?

జ:- మల్లె దానంతటగా అది బ్రతకలేదండీ. జొన్న మొక్క లేని చోట జొన్న మల్లెను మీరెపుడైన చూచారా.

ప్ర:- లేదండీ. ఎందుచేతనంటారూ.

జ:- మనకు బయట నుండి చూడటానికి మల్లె దానంతటి కదే పెరుగుతున్నట్లుగా కనపడుతుంది. కాని భూమి లోపలకు త్రవ్వి చూస్తే మల్లె మొక్క వేర్లు జొన్న వేళ్ళలోనికి చొచ్చుకుని ఉంటాయి. ఆ విధముగా వేళ్ళు నాటుకుపోయి మల్లె మొక్కలు ఆహారము, నీరు, జొన్న వేళ్ళ నుండి తీసుకుంటాయి దాని మీద జొన్న మొక్క సరిగా పెరగదు. కంకి కూడా చిన్నది వెళ్ళుతుంది. పంటతగ్గిపోతుంది.

ప్ర:- మల్లె విత్తనాలు అసలు ఎక్కడనుండి వస్తాయండి.

జ:- మల్లె మొక్కకు తెల్లటి పూలు పూసి విత్తనం కడ తాయి. యీ విత్తనాలు బహు సన్నగా ఉంటాయి. పొగ విత్తనాలకన్న చిన్నవిగా ఉండి నలుసుల్లాగా ఉంటాయి. ఇవి వేలకొలది నేలలో రాలుతాయి, నేలలో రాలిన మల్లె విత్తనములు 10, 15 ఏండ్ల వరకు మొలకెత్తగలిగి ఉంటాయి. ఐతే ఈ విత్త నములు జొన్న మొక్కలు పెరిగేచోట, జొన్న వేళ్ళు ఉన్న చోటే మొలకెత్తుతాయి. లేకపోతే మొలకెత్తలేవు. అట్లా జొన్న వేళ్ళు తలిగినట్లయితే యీ విత్తనములు మొలకెత్తి తమ వేళ్ళను జొన్న వేళ్ళలోనికి చొచ్చుకొని పంపి మొక్క పైకి

వచ్చును. అంటే మనకు భూమిమీద కనపడేటపుడు మల్లెమొక్క జొన్న మొక్కతో ఏమి సంబంధం లేనట్లుగా కనపడుతుంది. కాని ఈ సంబంధము నేలలో వేళ్ళ ద్వారా ఉన్నది.

ప్ర:- అయితే మల్లెను నివారించడ మెట్లానండి?

జ:- యీ మల్లె నివారణకు 10 సంవత్సరాలుగా నంద్యాల వ్యవసాయ ఫారంలోనూ, గుంటూరులోని, లాం వ్యవసాయ ఫారంలోనూ పరిశోధనలు జరిగాయి. అనేక పద్ధతులను గురించే పరిశోధించారు. కొన్ని పద్ధతులను కనిపెట్టారు కొన్ని మందులను చల్లి కూడా మల్లెను నివారించవచ్చునని కనిపెట్టారు. ఐతే వీటిలో ఏదో ఒకటి లోపమున్నది. కాబట్టి మల్లెను నివారించే జొన్న వంగడములను ఉత్పత్తి చేయడం మంచిదని నిర్ణయించారు. ఇందుకోసం "బాంగంహిలో" అనే జొన్న రకమును ఆఫ్రికా నుండి తెప్పించారు. దీనిని మన జొన్న రకములలో సంక్రమంచేసి కొన్ని కొత్త వంగడములను తయారు చేశారు. ఇంకా కృషి చేస్తున్నారు కూడా.

ప్ర:- ఐతే మల్లెను నిరోధించే వంగడములు వచ్చే వరకు మనం చేయగలిగిందేమీ లేదంటారా.

జ:- ఎందుకులేదండి. ఒక మంచి పద్ధతి ఉంది. కొంచెం శ్రమ అయినా కొద్ది సంవత్సరాలు యీ పద్ధతిని అవలంబిస్తే చాలా మంచిది. మల్లె మొక్కలు పూవు పూయకుండానే చూచిన వాటిని చూచినట్లు పీకివేయించినట్లయితే ఇక కొత్తగా విత్తనములు చేలో రాలవు. ఉన్న విత్తనములు కొద్ది సంవత్సరాలలో అయిపోయి మల్లె ఉండదు. ఇది కాకుండా ప్రత్తి, పెసర, మినుము మొదలైన పంటలను జొన్నతో మార్చివేసిన యెడల కొంత మేలు కలుగుతుంది.

ప్ర:- జొన్నకు ఇంకేవేమి తెగుళ్ల తగులుతాయి చెప్తారా

జ:- చెప్తాను. ముందర చెప్పినట్లుగా ఇంకా అయిదారు తెగుళ్ల జొన్నకు తగులుతాయి కాని ఇవి అంత ప్రమాదకరమైనవికావు. తుప్పుతెగులు జొన్నకు విస్తారముగా తగులుతుంది. ఐతే జొన్నకు కంకి వెళ్లే సమయానికి యీ జబ్బు ఆకులకు తగులుతుంది అందువలన పెద్దగానష్టం సంభవించదు. ఇదికాక కొన్ని ఆకుమచ్చ తెగుళ్ల కూడా ఉన్నాయి. ముఖ్యంగా జొన్న మొక్క వయస్సులోనున్నప్పుడు విస్తారంగా వర్షములు కురిసిన ఎడల ఆకుమచ్చ తెగులు విస్తారంగా పడుతుంది. కొంతనష్టం కూడా సంభవించవచ్చు.

ప్ర:- ఆకుమచ్చ తెగుళ్లను నివారించే దెట్లాగో చెప్తారా.

జ:- అదికొంచెం చిక్కు ప్రశ్నేనండి. వచ్చిన చిక్కేమిటంటే ఆ జబ్బులు నివారణచేసే మందులు ఉన్నాయి, కాని వాటిని వాడితే ఖర్చులు గిడతాయా లేదా అనేది సమస్య. జొన్నపైరులో రైతుకు మిగిలేదే తక్కువ. ఇక దానికి మందులు, మాకులు కొట్టాలంటే అసలేమీ మిగలదు. ఐనా యీ జబ్బులవల్ల విస్తారం నష్టం కాదు గనుక వీటిని గురించి ఏమీ చేయకపోవడమే మంచిది. కాటుకతెగులు, మల్లె యీ రెంటిని గురించి మనం జాగ్రత్తగా ఉంటే జొన్నపైరుకు చాలా నష్టాన్ని తగ్గించుకోవచ్చు. వీటిని నివారించడం కూడా తేలికైన పని. చవుకకూడా. కాటుక తెగులు నివారించడానికి ఒక పావలా కూడా ఖర్చుకాదు. ఇట్టి నివారణోపాయాలుండగా వీటిని తీసికొనకపోవడంవల్ల రైతుకు విపరీతనష్టం కలుగుతుంది ప్రతి రైతూ తన జొన్న విత్తనములను గంధకముతో కలిపి కాటుక తెగులును మన రాష్ట్రంలో నిర్మూలం చేస్తారని ఆశిద్దాము.

చక్కని జీవిత చరిత్ర చక్కని జీవితం లాగే అరుదైనది.

— కార్లయిలు.

# వల్లకీ!

— యస్. రాజన్న.

శా॥ ధర్మో పేతముఁగాగ రామపతి సీతాదేవి వర్జించి-త
న్మర్మ స్ఫుగ్వి రహంబు గుండెలకుఁ దన్నన్‌వాసమే కాంతమై
నర్మంబుల్ వచియించు చేడియగ నిన్మన్నించు కొన్నాఁడు, హృ
చ్ఛర్మాదాయిని! వల్లకీ! పలుకవేః సౌగంధ్య రాగంబులన్

గీ॥ వలపు కతలెల్ల నవరసములకు మాన్చి
పాడు చుండెద వవిరత భావమూర్తి!
జాపుఁదట్టని నీయను రాగములకుఁ
దలను వంపని మనుజుఁడీ ధరణి లేఁడు.

గీ॥ ప్రాణములకును ప్రాణంబు లనెడు వారు
ఉవిద లొక్కయ ప్డుంద్రు లేకుంద్రుగాని,
సర్వ కాలంబులందు మత్సన్నిధాన
మున వసించెడి ప్రేమ దాయినివి నీవు!

మ॥ కలకంఠీ కలకంఠ కోమల 'కుహూ' కారంబు వారింపఁగాఁ
గల నీ చల్లని పల్కునా యెదదనే కాలంబు వాసించుతన్
జల జాక్షీవిర హౌగ్ర తార్థులకు నాశ్వాసంబు సంధించునో
నలుగా నీయనురాగముల్ బలుపు వీణాసుందరీ! మొ్రొక్కెదన్



కథానిక

# అంతర్యుద్ధాలు

— కొంపల్లి మల్లిఖార్జునరావు.

అంతరాత్మలో అంతర్యుద్ధాలు ఆరంభమవుతయి. అంటే "ఆవేశం వివేకాల" మధ్య పోరాటం సాగిందని. ఆ పోరాటం సాగుతూన్నంత కాలం మానవుని హృదయ చాంచల్య స్థితి తికమక పడుతూంటుంది.

నెంబరు 54 బస్సు యూనివర్సిటీ బిల్డింగ్స్ దగ్గర ఆగింది. లోని జనసమ్మర్ధంలో నుండి తప్పించుకుని బయట పడింది లీల. ఎదురుగా రమణ కనుపించాడు. ఓమారు అతని వైపు చూచింది. ఆమె చూస్తుండగనే అతనేదో కాగితం క్రిందికి రాల్చాడు. తన సంగతి కొంది తన కెందుకను కున్నది. కానీ, అతని చూపులు మాత్రం అది తనకేనన్న భావన విశదీకరించినయి. అలా కాగితం రాల్చి రమణ వెళ్లిపోయాడు.

"ఆ వుత్తరం నాది కాదు నాకెందుకు ?..." అని అనుకునింది ఆవేశం లీలలో.

"నీదికాకుంటే వుత్తరం వదులుతూ నీ వైపు చూడాల్సిన అవుసరం ఏముంది ?.. పోనీ ప్రక్కనే ఎవరైనా వున్నారంటే ఎవ్వరూలేరుగా! ." అంది వివేకం.

"ఛీ !.... యీ మగవారికి గౌరవ మర్యాదలు, సమయాసమయాలు, సిగ్గు ఎగ్గులు తెలియవు. ఎంత క్రూర హృదయులు. అమాయకులైన అబలలను అల్లరి చెయ్యడంలో అఖండ ఖ్యాతిని చూపిస్తారు వారి కోమారు బుద్ధి చెప్పాలి !"

"ఏమని ?"....అంది ఆశ్చర్యంతో వివేకం.

"ఏమనేంటి....ఆ వుత్తరం తీసుకోకుండా వెళ్లిపోతే అతనికే బుద్ధొస్తుంది ! యింకోసారి వ్రాయడుగా !"

"ఉ....ఉ....ఉ" అని నవ్వింది వివేకం.

"ఏం ! అలా నవ్వుతావ్ ! యిలాంటివారికి తప్పక గుణపాఠం నేర్పాలి. వారి దురంతాలను అదుపాజ్ఞలలో పెట్టాలి."

"పిచ్చిదానా ! నేలవిడిచి సాము చెయ్యకు. ఏదైనా చేసేముందు యింగిత జ్ఞానం వుపయోగించాలి." అంది వివేకం ప్రశాంతంతో.

"ఏమిటా యింగితజ్ఞానం"

"ఏమీ లేదు ! అతనికి బుద్ధి చెప్పాలని ఆ వుత్తరం వదలి వెళ్తే ఎవరికైనా దొరుకుతుంది...."

"దొరకనీ ! .. నాకేం...."

"నీకేం కాదు ! ...చదువుతారు ! . యిది ఫలానా వాడు లీలకు వ్రాశాడు అంటారు ! ... వాళ్ల వాళ్ల స్నేహితులకు చూపిస్తారు. నానారకాల అపోహలు పోతయి. లీలకు ఫలానావాడితో సంబంధం వుందంటారు !....సంబంధం లేకుంటే యీ వుత్తరాలేలావస్తయి ? ఆనోటా ఆనోటా బడి కాలేజీ అంతా ప్రాకిపోతుంది ఆనాడు తల వంపులవుతుంది. ఆ తర్వాత యింటి దాకాపోతుంది నీకే కాదు ..నీ తల్లి తండ్రులకు కూడా చెడ్డ పేరు వస్తుంది. తెలుసా !....బాగా ఆలోచించుకో" అంది వివేకం ప్రశాంతంతో.

ఆవేశానికి చెమటలు పట్టినయి. ఏమీ తోచలేదు. కాలు కాలిన పిల్లిలా మసల జొచ్చింది. అయితే ఏం చెయ్యమంటావ్?....కటువుగా అడిగింది.

"ఏం చెయ్యాలో ఆలోచించి మరీ చెయ్యి! ఉన్న వాస్తవాన్ని విపులంగా విప్పి చెప్పాను. ఇక నీ యిష్టం''

''అయితే ఆ వుత్తరాన్ని తీసుకోమంటావా ?" గర్జించింది ఆవేశం.

''నీ యిష్టం....యికనే చెప్పేదేముంది?"

''ఛీ ! యీ నీచపు పనికినే నొప్పుకోను....ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు ? యీరోజు యితడు వ్రాసింది తీసుకుంటే రేపు మరొకడు వ్రాస్తాడు. యీ కుగవారికి బుద్ధి చెప్పాలంటే యిదే అదను" అని ముందుకు సాగబోయింది ఆవేశం అంతులేని ఆవేశంతో.

''ఆవేశం !....నా ఒక్క మనవి ఆలోచించు! స్త్రీ జీవితం ముల్లుపైని పడ్డ అరిటాకులాంటిది ! ఎవరికి కోపమొచ్చినా ఆ పాపఫలం తనదే అవుతుంది! ఏదైనా ఒక్కమాటు ఆలోచించి చెయ్యి. యిక నేనేమీ చెప్పను. అంది వివేకం గంభీరంతో కూడుకున్న సముద్రు నిలా

ఆవేశం బుర్రలో ఆలోచనలు ఉసుళ్ల పుట్టలా బయలుదేరినాయి. శరీరమంతా కంపర మెత్తిపోయింది ''ఏంచెయ్యాలి?.... ఏమిటిదారి?.... ఉత్తరం తీసుకోవడమా?.... మానడమా?.... అన్న సందిగ్ధావస్థలో సతమత మయిపోయింది. చివరకు ధృఢనిశ్చయం చేసుకుని బయలుదేరింది. అక్కడికి వెళ్లి పుస్తకం ఒంటి జారవిడిచింది. పుస్తకం అందు కుంటున్న నటనతో ఆ వుత్తరాన్ని అందుకుంది....నలువైపులా చూచింది....తన్నెవ్వరూ చూడలేదనుకుంది.

లీల అందరితోబాటు క్లాసులోకి వెళ్ళి కూర్చుంది. లెక్చరరు వచ్చి ఏం చెప్తూంది. మిగతా వాళ్ళు ఏం వ్రాసుకుంటున్నారో తనకేమీ అర్థం కాకుండా వుంది యీరోజు. ఏనాడూలేని యీ బాధ—భయం హృదయంలో ఆందోళన పరుస్తున్నయి. అవయవాలన్నీ తన ఆధీనం తప్పినట్లయింది.........ఆ వుత్తరం ఏమిటో?.... ఏం వ్రాసాడో?.... అసలు అది తనదేనేమో?.... చూడాలన్న ఆసక్తి. ఆందోళన ఓ వైపు కలిచివేస్తున్నాయి.

క్లాసు అయిపోయింది.

అందరూ వెళ్ళిపోతున్నారు.

* * *

''ఇన్ని రోజులనుండి లేని యీ పాప కంకిలమయిన పనికి యీరోజు పూనుకున్నావు. పాపం!.... ఆ పసిది ఆ వుత్తరం తీసుకునేటప్పుడు ఎంత బాధపడి వుంటుందో గదా;" వివేకం కాస్త తీక్షణంగా పల్కింది రమణలో.

''ఇష్టం లేకుంటే ఎందుకు తీసుకుంటుంది! పైగా తీసినా చించివేయక పుస్తకంలో జాగ్రత్తగా భద్రపరుస్తుంది.... చెప్పు!.... నీ ఆలోచనలన్నీ అవివేకంగానే వుంటయి.... యిక నిన్ను కాదని చేసినందుకు నా ప్లానులు ఎలా ఫలిస్తాయో చూడు!" అంటూ వుప్పొంగిపోయింది ఆవేశం రమణలో.

''ఆవేశం!.... ఆమె వుత్తరం అందుకున్నదని నీ పైని అనురాగం వుందని అనుకుంటున్నావ? అది ఘోరబాటు!"

''ఏం? ... ఎందుకని?'' ఉగ్రత్వం తాల్చింది ఆవేశం.

స్త్రీ హృదయాన్ని అర్థం చేసుకోవాలంటే నీకున్న యింగితజ్ఞానం చాలదు. ఆవేశం!.... సముద్ర గర్భంలో ఎప్పుడూ ఎన్నో పోరాటాలు, తుఫానులు. పగలూ భీభత్సంగా ఉంటాయి. ఇన్నింటితో కూడుకున్న సముద్రుడు ఎంత గంభీరంగా వుంటాడు. ఆ పోరాటాలు, అరుపులు, రోదనలు పరులకు వినిపించకుండా వుండేందుకే తనెప్పుడూ ఘోషిస్తుంటాడు సముద్రుడు అంతే స్త్రీ హృదయం. అంతులేని ఆలోచనలతో అలసి సొలసినా, బరువైన బాధలతో హృదయం భారమై పోతున్నా తనకున్న ఓర్పు సహనం అనే సుగుణాల వల్ల ఆమె పైకి పొంగదు. తనలోని ఆశ నిరాశలను పరుల కంటికి అందనివ్వదు.''

''ఏమిటీ మెట్ట వేదాంతం?....'' మధ్యలోనే అందుకుంది ఆవేశం

"అర్థం చేసుకునే శక్తి నశిస్తే అన్నీ మెట్టవేదాంతాల్లానే కనుపిస్తయి ఆవేశం! ...''

"యింతకీ యిలా చెయ్యడం తప్పంటావు!.... అంతేగా నువ్వనేది?....''

''ఆ విషయం నేను చెప్పాలా?....

''పిచ్చిదానా!'.... సృష్టంతా స్త్రీ పురుషుల సమాఖ్య. సహకారంపైనే ఆధారపడివుంది....తెలుసా!....

''ఆ తెలుసు.... కానీ వాటికీ కొన్ని నియమాలూ, సరి

హదులూ వున్నాయని తెలుసుకో ఆవేశం!.... ఆమె హృదయం నీ ఊహలతో ఏకీభవిస్తుందని నీకేం తెలుసు?.... ఏకీభవించేదే అయితే యఫ్ ఏ. ఫస్టియర్ నుండి మూడేండ్ల పాటు ఆమె యింటి చుట్టూ తిరుగుతే ఆమె నీ ముఖమయినా చూచిందా!.... ఈరోజున యీ వుత్తరం అందుకున్నందుకు ఆనందిస్తున్నావే?"

ఆవేశం మౌనముద్రలో వింటూంది.

వివేకం మరలా మొదలెట్టింది. ''ఆమె వుత్తరం అందుకొంది నీ పైని ప్రేమచేత గాదు. ఆ వుత్తరం విడచి వెళ్తే పరుల చేతికి దొరుకుతుంది కల్పనాభూతాలతో నిండినది యీ ప్రపంచం, ఉన్నది కాస్తయినా పువ్వులు, పిందెలు, కాయలతో సృష్టించి అల్లించే అలవాటు ఆచారం యీ ప్రజలది. ఆ తర్వాత ఆమె బ్రతుకు ఏమవుతుంది....

.... ఏం? ........ మాట్లాడవేం''?

''........ .... ... ......... .... ....... ....''

''నిజంగా ఆమె తెలివిగలిగింది గనుకనే వుత్తరం తీసుకొని వెళ్ళింది. దాని ప్రతిఫలం నీవు చెయ్యాలంటే ఆమెకెంతో సేపు పట్టదు అవేశం.... కాలేజీ ప్రిన్సిపాలుకు చూపిస్తే నీ గతేమవుతుందో ఆలోచించావా! ...ఏం?....'' ''డీ బార్'' అవుతావు. అంతేనా! .. వాళ్ళ తల్లిదండ్రులకు చూపిస్తే నీ పనేమవుతుందో తెలుసా ...! ''నీ ఎముకలు సున్నం లోకి దొరకవు. అసలు నీ తల్లిదండ్రులకు తెలిస్తే.... యిక నీవు పుట్టగతులుండవు.... అంతే! ...

ఆవేశానికి శరీరమంతా చెమటలు పట్టినయి. బుర్రలో బయలుదేరే ఆలోచనలలో దేనికి ప్రధాన స్థానమివ్వాలో అర్థంకాక బుర్ర పని చెయ్యడం నిలిచిపోయింది. కాస్త తెప్పరిల్లుకొనింది. ''అబ్బ ! కాస్త ఆలోచించనీ వివేకం !''

''ఆలోచించు! బాగా ఆలోచించు!.... నీకు అక్కచెల్లెండ్రు ఎందరో వున్నారు.... ఎవరైనా వారికిలా వుత్తరాలు వ్రాస్తే నువ్వు సహిస్తూ వూరుకుంటావా ? ముందు దీనికి సమాధానం కూర్చుకో!....తర్వాత....నీ యిష్టం !'' అంటూ వివేకం తనపనిలో నిమగ్నమయింది.

ఆవేశం ఓ మూలకూలబడి ఆలోచనలో మునిగిపోయింది. ఆదుర్దాతో రమణ లేచి టేబిల్ దగ్గరకు వెళ్లాడు.

* * *

లీల వుత్తరం ఆమూలాగ్రంగా చదివించి

"పాపం! యీ వుత్తరానికి ప్రత్యుత్తరం యివ్వకుంటే ఏమనుకుంటాడో పాపం!" అంది ఆవేశంలోని ఆనందోత్సాహాలను కప్పిపుచ్చుకుంటూ.

''పాపం! ఏమిటీ! అయినాయీ పాపం వుత్తరం తీసుకునేముందు ఏమయింది'' అని అంది ఆవేశం మతిచాంచల్యానికి ఆశ్చర్యపోతూ వివేకం.

''వివేకం! నువ్వన్నింటికీ యీలా మొండి జవాబులు చెప్తుంటావు! పాపం! అతని వుత్తరం బాగా చదివి అర్థం చేసుకుంటే ఎంతరాతి గుండె అయినా కరగక మానదు."

''ఏమిటి అంత జాలితనం !''

''ఏమిటేమిటి....నా కోసం రాత్రింబవళ్లు ఏలా బాధపడుతున్నాడో!....నా కోసం తన సర్వస్వాన్ని, చివరకు తన జీవితాన్నే అంకితం చెయ్య దల్చుకున్నాడు....''

''ఆవేశం!....అర్థంలేని ఆలోచనలలో బడి అలమటిస్తున్నావ్! కాస్త వాస్తవాన్ని గూర్చి విచారించి చెయ్యడం మంచిది....అతడు వ్రాసిన భాష మామూలే!....ప్రతి విటుడు వ్రాసే తీరుతెన్నులు యివ్వే వాటికి మోసపోయి లోనై ఎన్ని జీవితాలు నాశనమైపోయాయి ఒక్క మారు అవివేకానికీ, ఆవేశానికి స్వస్తి చెప్పి ఆలోచించు తెలుస్తుంది...."

''వివేకం !....అయిన దానికీ కానిదానికి ఆలోచించడం అవివేకం....అతని హృదయం మంచిది నన్ను వివాహం చేసుకోవాలని కుతుహలం చెందుతున్నాడు ... అలాంటప్పుడేం ? ....అతడు రూపంలో తక్కువా!.... పోనీ చదువు సంధ్యల్లోనా!....లేక ఆస్తిపాస్తుల్లోనా !.... ఆలోచించు........

"ఆవేశం....వివాహమంటే బొమ్మల పెండ్లిళ్లనుకున్నావా ?....భావి జీవితాలు ముడివేశే బంధం ...ఎటు తిరిగినా అవుతుంది ఉరికంబం తెలుసా ! ...అయినా వివాహం చేసుకోవాలనే కుతూహలంవుంటే కనిపెంచి పెద్ద చేసిన తల్లిదండ్రులేమైనారు!....వారికి తెలియకుండా యిలా వ్రాయాల్సిన అవుసరం ఏముంది....?''

"నాకు యిష్టం వుందోలేదో తెలుసుకునేందుకే వ్రాసి

వుంటాను....తప్పేముంది....'' అంది వెటకారంగా ఆవేశం

"ఆవేశం!.... ముందు మనస్సు తెలుసుకునేందుకే వ్రాస్తారు ప్రతివారు. వుత్తరంలో హృదయం విప్పి చెప్పిం తర్వాత ఒక్కమారు నీతోమాట్లాడాలి బీచికో, పార్కుకో రావాలంటారు....అ తర్వాత....ఏమేమో అంటారు.... యిక వివాహానికి తావేదీ ?.... ఆత్మార్పణ అయ్యే సమయం ఆసన్నమవుతుంటే ?''

''కానీ యితని హృదయం అలాంటిది కాదు!"

"పిచ్చి దానా!... నలుగురూ వ్రాసేభాషే అతడు వ్రాసినప్పుడు, అతని హృదయం వేరే అని ఏలా చెప్తావ్?.... అయినా....నీకుటుంబ పరిస్థితులు....నీ యింట్లో జరిగే సనాతనా చారాలకు... నీ తల్లిదండ్రుల మనస్తత్వాలకు యిది సరితూగేది కాదు.... అనవసరంగా జీవితాన్ని పాడు చేసుకోకు... పసితనపు హృదయ చాంచల్యంలో ప్రతీదీ మంచిదిగానే కనుపిస్తూంటుంది... తాను చేసిందల్లా సరిగానే వున్నట్లు తోస్తుంది!''

''ఇంకా ఆసనాతనాచారాలతోనే క్రుగ్గి పోతుంటే.... మావంశంలో ఎవ్వరికీ లేని చదువులు నాకెందుకు చెప్పిస్తారు!... ఎవ్వరూ యింట గుమ్మం దాటనివాళ్లు నన్నెందుకు స్వేచ్ఛగా వుండనిస్తారు ?'' అంది ఆవేశం తనదేపై చెయ్యన్నట్లు.

''ఈ స్వాతంత్ర్యం, యీ స్వేచ్ఛ యిచ్చింది... యీలా చదువులు చెప్పిస్తుందేది....వాళ్ల మాటలను తృణీకరించి యీలా అడ్డమయినవారితో ప్రవర్తించేందుకేనా ! .. సిగ్గు లేదు!....ఈ కాలంలో వివాహాలు కావాలంటే అమ్మాయికి ఏమయినా చదువుందా!....అని అంటారు... కట్నాలకన్నా చదువులకే ప్రాముఖ్యత యిస్తున్న నేటి నాగరికయుగంలో హీనమైనా విజ్ఞానం, విద్యలేంది ఎందుకు కొరగారనే యీ చదువులు ఆరంభమయినయి.... అందుకె నీ తల్లి దండ్రులు నీకు యింత చదువులు చెప్పిస్తున్నారు....అంతే కానీ.... యితరులు వ్రాసిన వుత్తరాలకు కరిగిపోయి ప్రత్యుత్తరమిచ్చేందుకు కాదు!''

"You shut up!''..నోటి కొచ్చినట్లు మాట్లాడకు!".... ఆవేశం వుగ్ర రూపం తాల్చింది.

''ఆవేశం!....నీవు ఆవేశపడి నన్నందువల్ల నాకేం బాధ లేదు...కాని యీ శరీరంలో నాకు హక్కుంది.... కానీ కాలు జారితే కదల్చవచ్చుగానీ మనసు జారితే తిరుగు లేదు! అందుకే నాకు తెలిసినది చెప్పాను... !'' అంది వివేకం నిండుకుండలా!...

''నీకే కాదు యీ శరీరంపై నాకూ అధికారం వుంది!...ఆ మాత్రం నాకూ తెలుసు!...ఆలోచించే అన్నీ చేస్తున్నా!....నీ కెందుకు నోరు మూసుకొని పడుండు....!''

"సరే ! ఏలా జరగాలో అలాగే జరుగుతుంది!...." అని అంటూ తన పనిలో నిమగ్నమయింది వివేకం.

వివేకం నోరు మూత పడిందన్న ఆనందం ఆవేశాన్ని వుప్పొంగ జేసింది.

లీల గబగబ టేబిల్ దగ్గరకు వెళ్లింది.

* * *

ఆ రోజున యిద్దరూ వుత్తరాలురాల్చారు. ఇద్దరూ అందుకున్నారు.

లీల వ్రాసిన వుత్తరం అందుకుని రమణ చించి చదివాడు....

డియర్ రమణా !

మీ వుత్తరానికి సమాధానమివ్వాలంటే డిక్షనరీలోనే మాటలు కరువైనట్లు తోస్తుంది...ఆ సుముహూర్తం ఎప్పుడు ఆసన్నమవుతుందా అని ఎదురు చూస్తున్న...

నీ లీల

రమణ నిర్ఘాంత పోయాడు.

* * *

రమణ రాల్చిన వుత్తరం అందుకొని గబగబ యింటికి వెళ్లింది లీల!... తన గదిలోకి వెళ్లి తలుపు గడిపెట్టింది! ఓ సోఫాలో పడుకుని కాగితం విప్పింది ...

డియర్ చెల్లీ,

అనాలోచితంగా....నీ మనస్తత్వాన్ని అర్థం చేసుకోకుండా వ్రాసినందుకు క్షమిస్తావుగా చెల్లీ !...

ఇట్లు
రమణ

లీల కంపించి పోయింది. చేతిలోని వుత్తరం క్రింద పడిపోయింది

---

# ఎదురు తిరిగి...... ...... ......

—" కులపతి "

అంతయు నీవుగానయిన యామధురోహల వెంబడిన్ బ్రయా
ణింతును ముక్తి గోపురమణి ప్రకరంబులు తోచుదాక; వ
ర్ణింతును కావ్య మంత్రముల నిన్ను ప్రవేశము కల్గుదాక; సా
ధింతు భవాబ్ధికిన్ చరమ తీరము భారము తీరి నట్లుగన్

నన్నేమొ సంసృతి బంధనమ్ముల జిక్కితి నంచు
మున్నీవు వెక్కిరించితివి; ముదిమిచే దస్తంబు హెచ్చి
ఎన్నెన్ని బ్రహ్మకల్పంబు లీసృష్టి సంసృతిం బడియు
తన్ను కొంచుంటివో సుంత తట్టదా స్వామినీ కెపుడు?

ఈ సృష్టి నేయుట, దీని నింపార పోషించు కొనుట
ఏ సర్వ భక్షక రాక్ష సేంద్రుడో ధర్మంబు చెరుప
వేసంబు కట్టుట వాని వేధింప, మత్స్యమో, కమఠ
మో, సూకరమొ!- దేవుడనుట కొప్పునో జంజాటమింత!

ముప్పది మూడైన కోట్ల ముద్దు బిడ్డలు దేవతాళి
ఎప్పుడు విడక కాళ్లొత్తు నిందిరా తామర సాక్షి
గొప్ప వారింటి దర్జాలు కొల్లలు; భోగమే ప్రొద్దు
చెప్పుటో బదరికాశ్రమము చిమ్మిన తొలిముని వనుచు!

కూతుగామించినవాడు గొప్పేమొ సత్య లోకమున
పాత విద్యలు నాల్గునేర్వ పాపంబు పరిహార మగునె?
ఆతండు భూమండలమున నతి యప్రశస్తుండు, నుదుటి
వ్రాతయు తప్పునా? పనికిరాడు పూజాదికమ్ములకు!

మాలోన వాగ్దాన భంగ మర్యాద రెండు నాల్కలకు
పోలిక చెప్పెద మిట్టి మోసంబు లెరిగిన మేము
నాలుగు నాల్కలవాని నాదముల్ వేదముల్ నమ్మ
ఛేలాగు? భూలోక వాసి కిది పెద్ద చిక్కయ్యె నేడు!

3

పడతికి దాసోహ మన్న పతిఘనుడేము వేల్పులకు
వడి వాడు భూమండలమున వటి బైరాగి గాకెక్క!
చెడితివి బిడియము లేదొ, చెరిసగమైనది తనువు
అడిగిన గాని మేమిత్తుమా? తను వర్ధాంగికైన.

దినమొక్క గండంబు, తిరిగి తెచ్చిన బిచ్చములోన
గణపతి తొంబది పాళ్ళు కాజేయు నుదరమువాడు
తినుదురో తినరొ దంపతులు దిగులుతో సగమయినారు
మినువాక గ్రుక్కెడు నీళ్ళుమింగి ఏ ప్రొద్దు పస్తుండ!

కామము కోసితినంచు గప్పాలు కొట్టుట కాదు
ఆమేను లేనియనంగు నణచుట గొప్పేమి కాదు
నీమంబుచెడి, దారు కావనీ విహారసమయ జాత
మా మహా కామమేమందు వస్మాదృశులకైన గలదె?

పడతి నీ పెట్టినయాన పట్టక పుట్టింటికేగ
కడుపున బుట్టిన కొడుకు గణపతి వాకిట నాప
చెడిన ప్రతిష్ఠను చక్క జేసుకోజాలని నీవు
పిడుగును పిలుచుకొన్నట్లు వ్రేలెత్తినను జూపనేల?

శ్రమసుంత లేదు నీ దుష్ట సంకల్పరీతి పల్కుటకు
సమదృష్టిలేమి నీకనుల సంఖ్యయే చెప్పు; లోకాల
సమయింప జేసెదు నీకు సాధు భావమ్మును లేమి
కమరిన పులిచర్మ మురగ హారముల్ చాలవే ఋజువు!

చిప్ప చేతను బట్టి తిరుగ జేనెడి దేమనుకొంటి ?
ఎప్పుడు మరుభూమి వాసమే పురాకృత సంచితమ్మొ!
చెప్ప శక్యముగాని లేమి చిహ్నామై వెలిబూది మేన
గప్పుట, దయ్యాల చెలిమి కాదందువో పాప ఫలము ?

అనుచేల నీ మీద పెట్టి, యసలు నీకు నికేమి కలదు ?
మనిషి తీర్చిన 'రూపకలిత మాధుర్య మూర్తివి కాక !
తనలోని సకలోహలకును తాత్పర్యమైనట్లు నిన్ను
మనిషి రూపొందించు కొన్న మాదిరి నూహింతు నేను !!

* * *

నినుధ్యానించి, యెడంద నిల్పి కవితన్ జేసాచినే నేదియం
టిన బంగారము నేయు మంచడిగితిన్, బేరాస భాగ్యంబుకో
రినయట్లర్థము తీసికొంటివట! ఉర్వీ సర్వశబ్దార్థ వ
ర్తనుడౌ నీకెటుగల్గె తెన్గునుడికారంబందపాండిత్యముల్

—:*:—

జీవించడం కూడా ఒక కళే. బాల్యంలో ఆట పాటలతో ఆనందించాలి. యౌవనాన్ని సాహసోపేతంగా మర్యాదా సంపన్నంగా గడపాలి. వార్ధక్యంలో ప్రశాంత చిత్తంతో ఉండాలి. ఈ రకం జీవితం మనకే కాక మన పొరుగు వారికి కూడా సుఖకరంగా ఉంటుంది.

— ఆర్. ఎస్. స్టీవెన్సన్.

* * *

ఇతరులు చేసిన పనులనే చేయడానికి ప్రయత్నించడ మెందుకు? మనకు ఏ పనియందు ఉత్సాహం కలుగుతుందో దానినే చేయడం ఉత్తమం.

— శ్రీ అరవిందులు.

# ఆంధ్ర ప్రదేశ్ లో యాత్రాభివృద్ధి

— పి. రంగారెడ్డి

అనాది నుంచీ మానవుడు కాలక్షేపానికై ప్రయాణాలు చేస్తూనే ఉన్నాడు. అందుకు కావలసినది కూడా ఎక్కువ యేమీ లేదు. రెండు కాళ్లూ, వింతలను చూసి ఆనందించే శక్తీ ఉంటే చాలు. చరిత్ర ప్రారంభమైన నాటినుంచీ జ్ఞానార్జన నిమిత్తమో, స్థలాలను లేక కేవలం మనుష్యులను వీక్షించడం కోసమో కొందరు బహు దూర ప్రదేశాలకు ప్రయాణం చేసినట్లు మనం చదువుతాం. వీరిలో కొందరు తమ ప్రయాణాలను గురించి వ్రాసిన విషయాలు చరిత్రకు అతి ముఖ్యమైన ఆధారాలుగా ఉన్నవి. పాహియాన్, హ్యూన్‌స్యాంగ్‌ల వంటి ప్రయాణీకులు తాము విజ్ఞానార్జన చేయటమే కాక ముందు తరాలకు సౌభ్రాతృత్వాన్ని ప్రసాదించారు.

ప్రయాణమే క్రమంగా యాత్రగా మారింది. ఒక పద్ధతి ప్రకారం దాదాపు ఒక క్రమబద్ధమైన పరిశ్రమ వలె జరిగే ప్రయాణమే యాత్ర. అయితే అభివృద్ధికి అవకాశంగల సాంఘిక కలాపంగా దీని చరిత్ర 20వ శతాబ్దం తొలిపాదంలోనే ఆరంభమయినది. అప్పుడు, రవాణాని, రాకపోకల సౌకర్యాలు అభివృద్ధి చెందుటతో ఎక్కువ మంది ప్రజలు ప్రపంచ పర్యటనను సలిపేవారు. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమే యాత్ర పరిశ్రమగా అభివృద్ధి చెందింది. అప్పుడు యిరోపా దేశంలో యుద్ధం వల్ల చితికిపోయిన దేశాల ఆర్థిక పరిస్థితి యాత్రికుల వల్ల వచ్చే ఆదాయంతో చాల వరకు చక్కబడింది.

భారతదేశంలో యాత్రా కేంద్రాల అభివృద్ధి పరిశీలనకై 1945లో సర్ జాన్ సార్జెంటు అధ్యక్షతన ఒక సంఘం నియమించబడినది. ఈ విధంగా దేశంలో యాత్ర బాల్య దశలో ఉంది. రాష్ట్రాలలో శిశు దశలో ఉన్నది. అభివృద్ధికి ఒక నిర్దిష్ట విషయంగా యిది ద్వితీయ పంచవర్ష ప్రణాళిక లోనే చేర్చబడింది.

ఇంట్లో ఉన్నప్పుడు మంచి స్థితిలో ఉన్నానని, ప్రయాణీకుడుగా (ఉన్న దానితో) సంతృప్తి చెందాలని షేక్స్పియర్ 'టచ్‌స్టోన్' అంటాడు. ప్రయాణీకులకు నిజంగా సంతృప్తి కలిగించేందుకై ఎకలచర్యలు గైకొనబడుతున్నవి. ఇందు నిమిత్తం దర్శనీయమైన స్థలాలలో సుఖకరమైన నివాసం, మంచి భోజనం వగైరా సౌకర్యాలు సమకూర్చబడాలి. రెండవది వస్తుంచే స్థలానికి చెందిన సరైన కనీస సమాచారంవారికి తెలియాలి. ఈ రెండు అంశాలను మేము పరిశీలిస్తున్నాం.

విదేశ యాత్రికులు, స్వదేశ యాత్రికులు అని యాత్రికులను స్థూలంగా రెండు తరగతులుగా విభజించ వచ్చు. విదేశ యాత్రికుల వల్ల ఆర్థికంగా రాజకీయంగా, సాంఘికంగా లాభం కలుగుతుంది. 1950 నుంచి విదేశ యాత్రికుల నుంచి మనకు ఏటా విదేశ మారకం రూపంలో 20 కోట్ల రూపాయలు వస్తున్నవి. విదేశీయుల రాక వల్ల ఆయా దేశాల ప్రజలతో మన ప్రజలకు స్నేహ సుహృద్భావాలు కూడా పెంపొందుతాయి.

విదేశ యాత్రికుల వల్ల కలిగే లాభాలు ఎటువంటివైనా స్వదేశ యాత్రికులను అశ్రద్ధ చేయడానికి వీలులేదు. మన దేశం యెంతో పెద్దది, యిక్కడ ఎన్నో భాషలు, సంప్రదాయాలు ఉన్నాయి. కాబట్టి ప్రజలు స్థలాంతరాలకు వెళ్ళి

అక్కడి విషయాలను తెలుసుకొనడం మన జాతీయ ఐక్యతకు మిక్కిలి ముఖ్యం. ఆంధ్ర ప్రదేశ్ కొత్తగా ఏర్పడిన రాష్ట్రాలలో ఒకటి. దీనిని గురించి ఉత్తర భారతంలో ఎక్కువ మందికి తెలియదు. కాబట్టి ఎక్కువ మంది మన రాష్ట్రానికి వచ్చి ప్రాచీన వైభవానికీ, ప్రస్తుత కృషికి దర్పణాలనదగిన ప్రదేశాలను గురించి తెలుసుకోవాలి. కాబట్టి విదేశ యాత్రికులతో పాటు స్వదేశ యాత్రికులకు కూడా ప్రోత్సాహమివ్వటం ముఖ్యం.

ముఖ్యమైన యాత్రా కేంద్రాలలో సుఖప్రదమైన విశ్రాంతి మందిరాలకై ద్వితీయ పంచవర్ష ప్రణాళికతో మన ప్రభుత్వం 7 లక్షల రూపాయలను ఖర్చుపెడుతున్నది, తృతీయ ప్రణాళికలో యీ ఖర్చు దాదాపు 19 లక్షలు ఉండవచ్చు. ఆపైన మనకి హైదరాబాదులో అధునాతనమైన యాత్రిక సమాచార కేంద్రం ఒకటి ఉన్నది. కేంద్ర ప్రభుత్వ సహాయంతో తిరుపతి, విశాఖపట్నం, వరంగల్లులలో మరిమూడు ప్రాంతీయ కేంద్రాలు తెరువబడుతున్నాయి.

వీటికి తోడు రోడ్డు రవాణా కార్పొరేషన్ ఒక లగ్జరీ టూరిస్టు కోచ్‌ని సంపాదించింది. సరసమైన రేట్లపై దీనిని నడపాలని సంకల్పించాం. గైడ్‌ల శిక్షణ కోర్సును నడపాలని కూడ సంకల్పించాం. ఇందువల్ల యాత్రికులకు విద్యావంతులైన గైడ్‌లు నిర్ణీతమైన రేట్లకు లభిస్తారు

రాష్ట్రంలో యాత్రాకేంద్రాల అభివృద్ధికై మన ప్రభుత్వం పై చర్యలను గైకొంటున్నది యాత్ర విజ్ఞానదాయకం. పౌకర్యాల విస్తరణతో ఎక్కువ మంది ప్రజలు యీ ప్రయోజనాలను పొందుతారని ఆశిస్తాం



అహంకార దూషితం కాని నవ్వు కన్నీటి కంటె విలువైనది. ..... జనన మరణాలను తప్పించుకోలేము. కాబట్టి మనం చేయగలిగినదల్లా యీ మధ్య కాలాన్ని అనుభవించడమే. మరణ సంజనితమైన అంధకారం నుంచే నవజీవన కాంతి కిరణాలు ఉద్భవిస్తాయి.

— జార్జి సంటయానా.



మీ రచనలలోని లోపాలను సరిదిద్దుకోవాలంటే మీ పుస్తకాలను మీ శత్రువుల చేత చదివించాలి; ఎందువల్లనంటే మీ స్నేహితుడు దాదాపు మీరే కావడం వల్ల వాటిని మీ దృష్టితోనే చూస్తాడు

— పోప్.

# తెలుగు సాహిత్యం - విషాద నాటకాలు

— శ్రీనివాస చక్రవర్తి

కావ్యం, ముఖ్యంగా దృశ్యకావ్యం సుఖాంతంగా పరిణమించాలని భారతీయ లాక్షణికులు అనుశాసించారు. నాటకాలలో నాయకుడు మృతిచెంది విషాదాంతమయితే రసభంగమవుతుందనీ ధర్మమే జయమనే సూక్తికి భంగం వాటిల్లుతుందనీ వారు భావించిఉండవచ్చు. కాని ఈ లాక్షణికులకు పూర్వకవులు వాల్మీకి వ్యాసుడు తమ రామాయణ మహాభారతాలను విషాదాంతాలుగానే రచించారు. రాముడు సరయూనదిలో దిగి అవతారం చాలించడంతో రామాయణం, పాండవుల స్వర్గారోహణతో భారతం ముగుస్తాయి. భాసుడు లాక్షణికులకు పూర్వుడు కావడంవల్లనో లేక లాక్షణికులను లెక్కచేయకనో ఊరుభంగం దు:ఖాంతం చేసాడు. నాయకుడు దుర్యోధనిని మరణంతో నాటిక ముగుస్తుంది. కాళిదాసు మేఘ సందేశం పూర్వభాగం మాత్రమే వ్రాసి వదిలివేసాడని తరవాత ఎవరో పూరించారని ఒక ప్రతీతిఉంది. అలాగే భవభూతి 'కరుణ ఏవరస'తో ఉత్తర రామచరిత ముగిస్తే లక్షణ విరుద్ధమని ఎవరో దానిని పూరించారని ఒక కథ ఉన్నది. ఇక ఆ తరువాతి సంస్కృత నాటక కర్తలు నాటకాలు సుఖాంతంగానే వ్రాసారు.

ఇక పాశ్చాత్యనాటకాలు తీసుకుంటే గ్రీకులు విషాదాంత నాటకాలకు అగ్రస్థానం ఇచ్చారు. అరిస్టాటిలు వీటికి లక్షణం రచించాడు, విషాదాంతంతో పాటు వస్తు, కాల స్థలైక్యతలు ఉండాలని అనుశాసించాడు. ఇటలీ, ఫ్రెంచి రచయితలు అరిస్టాటిలు లక్షణాన్ననుసరించే విషాదాంత నాటకాలు రచించుతూ వచ్చారు, కాని షేక్స్పియరు మాత్రం అరిస్టాటిలు సూత్రాలను త్రోసిరాజని స్వతంత్ర మార్గం ద్రొక్కి విషాదాంత నాటకాలు వ్రాసి విశ్వవిఖ్యాతి నార్జించుకున్నాడు. హామ్లెట్, ఒథెల్లో మాక్బెత్, కింగ్‌లీరు ప్రపంచనాటకాలలో అగ్రశ్రేణికి చెందినాయి. షేక్స్పియర్ విషాదాంత నాటకాలలో నాయకుడు గొప్పవాడు. సద్గుణ సంపన్నుడు. అతని ఆపద జనులందరికీముప్పు. కాని అటువంటి నాయకుడికి పెద్దగా పరిగణించరాని లోపం ఉండి కొన్ని పరిస్థితులలో అది బ్రహ్మరాక్షసియై అతనిని అణగదొక్కుతుంది. నిరాశా నిస్పృహలతో నాయకుడు ఆత్మహత్యచేసుకుంటాడు. హామ్లెటు తటపటాయింపు గుణం అతని మరణానికి కారణమైంది. పొగడ్తలకు ఉబ్బిపోయే గుణం లీరు రాజును నాశనం చేసింది. ఇలాగే తక్కిన విషాదాంత నాయకులలో లోపాలు వారిని అణచివేసాయి.

1880 వరకు తెనుగులో నాటకాలే లేవు. కోరాడ రామచంద్రకవి మంజరీమధుకరీయం 1860 లో రచించినా 1902 కి గాని అచ్చుకాలేదు. అప్పటికే ఆంధ్ర దేశంలో ఇంగ్లీషు విద్య వ్యాపించింది. షేక్స్పియరు మొదలైన పాశ్చాత్య నాటక కర్తల విషాదాంత నాటకాలతో తెనుగు రచయితలకు పరిచయం ఏర్పడింది. విషాదాంత నాటకాలు వారిని ఎక్కువగా ఆకర్షించాయి. ఈ కొత్త సాహిత్య ప్రక్రియను తెలుగులోకి తీసుకురావాలని ధర్మవరం రామకృష్ణమాచార్యులు విషాద సారంగధర నాటకం వ్రాసి 1918 లో ప్రకటించారు. ప్రకటించినది 1918లో అయినా అంతకు పూర్వమే దీనిని వ్రాసి ప్రదర్శించినట్లు తెలుస్తుంది. విషాద సారంగధర పీఠికలో ఆచార్యుల వారు "ఈ నాటకము విషాదాంతముగా నొనర్పబడి యున్నది. ఇది కొత్త పద్ధతియగుట యెఱుగని వాడగాను. ఆంగ్లేయ భాష యందిట్టి విషాద నాటకములనేకములు కలవు. నీతి

బోధ విషాదనాటకముల యందు వలె మంగళాంత నాటకములయందు గలుగ జాలదని నాకు దప్పని యభిప్రాయము. కావున నీ కొత్త పద్ధతి ననుకరించితి. కథలో సారంగధరుని కరపాదచ్ఛేదమైన పిదప సిద్ధుడొకడరుదెంచి కాలు సేతులు మొలిపించెనని వ్రాయబడియున్నది. ఆరసి చూడ విషాదాంతముగా కథ ముగించుటకుగల యనభిలాషము సిద్ధుని రాకకు గారణమైనట్లూహింపదగి యున్నది. కాలు సేతులు మొలచుట స్వాభావికము కాదు. కావున సారంగధరుని మృతియే స్వాభావికముగ నుండుటయే కాక కథయందలి నీతిని పట్టుదలగా గలిగించుట కాధారమగుటం జేసియు నదియే యాదరింప బడియున్నది" అని తమ అభిప్రాయం వెల్లడించారు. ఈ నాటకం ప్రదర్శించిన తరవాత విషాదాంత నాటకములు వ్రాయవచ్చునా కూడదా అని విమర్శకులలో తర్జన భర్జన సాగింది. వారివారి వాదాలలో బలాబలాలెలా ఉన్నా పాఠకులు, ప్రేక్షకులు ఈ కొత్త ప్రక్రియను మెచ్చుకుని ఆదరించారు. అందుమీద కృష్ణమాచార్యులవారు చంద్రహాస ముక్తావళి, అజామిళ విషాదాంతంగానే రచించారు. హిరణ్యకశ్యపుని నాయకుడని భావించితే ప్రహ్లాదకూడా విషాదాంత నాటకమే. విషాద సారంగధరగానే చంద్రహాస కూడా బహుః జనాదరణ పొందింది. ఇది విషాద సారంగధర కంటే ముందే 1916 లో ప్రథమ ముద్రణ పొందింది, కాని ఇది ప్రథమ ముద్రణలో మోదాంతంగానే ముద్రింపబడింది. రెండవ ముద్రణ 1922 రెండవ ముద్రణలో ఆచార్యులవారువిషాదాంతంగానే ముద్రించారు. దీనికి దారితీసిన పరిస్థితులను ప్రకాశకులు ఇలా వ్రాశారు."ఎంత రుచికరములైనను,నెంత నీతిదాయకములైనను నాదరింప బడకుండిన విషాదాంతనాటకములిప్పుడత్యంతాదరమును బడయుచున్నవి. ఇందులకు విషాద సారంగధర నాటకమే తార్కాణము. అదియప్పుడే నాల్గవ సారి ముద్రింపబడి యైదవ ముద్రణ కెదురుచూచుచున్నది. దీనివలన ఖేదాంత నాటకములు మన వారి నెంతయో యాకర్షించియుండుట తెల్లమగుచున్నది.

"తొలదొల్త నీచంద్రహాస నాటకము సైతము విషాదాంతముగా రచింపబడియుండె. కాని యట్టి నాటకములంతగా నాదరింపబడని యాకాలమున ఖేదాంతముగానే దీని బ్రదర్శింపగాని, ప్రకటింపగాని ధైర్యము చాలమి గ్రంథకర్త దీనిని దనమనసొప్పకున్నను, మోదాంతముగా మార్చె. అట్లే దీని ప్రథమ ముద్రణము గావింపబడియె. కాని ఇటీవల స్థితిగతుల పరామర్శించి కవి తొలుతనుద్దేశించిన విధముననే యిది యిప్పుడు ఖేదాంతముగ ముద్రింపబడియె."—అంటే 1922 నాటికి విషాద నాటకాలు వ్రాసి ప్రజాదరణ పొందవచ్చనే ధైర్యం చిక్కిందన్నమాట. అలాగే రామకృష్ణమాచార్యులవారి సారంగధర, చంద్రహాస నాటకాలు అనేక ముద్రణలు పొందడమే గాక వందల సార్లు ప్రదర్శింపబడి ప్రజల మన్ననలందుకున్నాయి.

ఆచార్యులవారి తరవాత చెప్పుకోతగ్గ విషాదాంత నాటక కర్త అయన సమకాలీనుడు కోలాచలం శ్రీనివాసరావు. వీరిదీ బళ్లారే వీరు రామరాజు, చాందుబీ. శిలాదిత్య నాటకములు విషాదాంతంగా రచించారు. ఈ మూడింటిలో ఎక్కువ ప్రసిద్ధికెక్కినది రామరాజు; బళ్లారి రాఘవకు ఖ్యాతి తెచ్చి పెట్టిందీ—ఈ నాటకమే. చిత్రమేమంటే కోలాచలం వారు దీనిని మోదాంతంగా వ్రాస్తే వారి సుమనోరమ సభవారు దీనిని విషాదాంతంగా ప్రదర్శించారు. చివరకు రెండు పాఠాలు నాటకంలో ముద్రించడం జరిగింది ఈ ఇద్దరి విషాద నాటకాలు బాగా ఆదరించబడడంతో యీ ప్రక్రియకు రాజబాట ఏర్పడింది తెలుగులో ప్రఖ్యాత విషాదనాటకాలు ఎక్కువగా వెలువడసాగాయి.

శ్రీపాద కష్ణమూర్తి శాస్త్రిలవారి బొబ్బిలియుద్ధం 1908 లో వెలువడింది. కాని అది చినరంగరాయల పట్టాభిషేకంతో అంతం కావడంవల్ల దానిని మోదాంతమేనన్నా యదార్థానికి అది విషాదాంతనాటకమే. అందులోని ప్రధాన పాత్రలన్నీ మరణించింతరవాత అది మోదాంతం, అవడం సబబుగాలేదు.

విశ్వనాథ సత్యనారాయణ నాటకాలలో నర్తనశాల, వేనరాజు ప్రఖ్యాతిగాంచిన విషాదాంత నాటకాలు. కీచకునిలో పరస్త్రీలోలత అనే లోటు అతని మరణానికి కారణమైంది. వేనరాజు మంచి రసికుడు. కాని వేదమతమంటే గిట్టదు. కాలానికి ఎదురీది మరణించాడు. ఈ వేనరాజు కథ త్రిపురనేని రామస్వామి చౌదరి ఖూనీ అనే పేరుతోను విప్లవం అనే పేరుతో ధనికుల బుచ్చి కృష్ణయ్య చౌదరి విషాదాంత నాటకముగా రచించి ప్రఖ్యాతి చెందారు ఈ

రెండూ అనేక సార్లు ప్రదర్శింపబడి ప్రజల మెప్పును పొందాయి.

ఆంధ్ర షేక్స్పియర్ పానుగంటి లక్ష్మీ నరసింహారావు సిద్ధుడు సారంగధరుని కాలుసేతులు అతికించినట్లు వ్రాసి సారంగధరను మోదాంతం చేసినా తర్వాత తర్వాత విషాదాంత నాటకాలు వ్రాసారు. వారి పూర్ణిమలో పాత్రలన్ని నాటకం చివరికి మరణిస్తాయి.

ఆంధ్రులను ఎక్కువగా ఆకర్షించిన ఇంకొక విషాదాంత కథ అనార్కలీ. ఈ కథను అనేకులు విషాదాంతంగానే రచించారు. వారిలో ముఖ్యులు వింజమూరి లక్ష్మీ నరసింహారావు, ముద్దుకృష్ణ, విశ్వనాధ సత్యనారాయణ, మిత్ర శ్రీ, ఊటుకూరి సత్యనారాయణరావు అలాగే సంయుక్తా పృధ్వీరాజుల విషాదాంత గాథను కూడా పెక్కుమంది విషాదాంత నాటకంగానే రచించారు.

ఆంధ్రుల ఆదరాభిమానాలు చూరగొన్న ఇంకో విషాద గాథ అల్లూరి సీతారామ రాజు చరిత్ర మహావీరుడుగా తెలుగు వారిచేత పూజింప బడుతున్న సీతారామరాజు కథను గబ్బిట వెంకటరావు, పడాల రామారావు ప్రభృతులు విషాదాంతంగానే రచించారు. ఇవి అనేక సార్లు ప్రదర్శింపబడ్డాయి. పడాల పితూరి అనేక ముద్రణలు చూసింది.

గుండిమెడ వెంకట సుబ్బారావు ఖిల్జీరాజ్య పతనం, జయదేవ; పింగళి నాగేంద్రరావు వింధ్యారాణి', కొప్పరపు సుబ్బారావు 'రోషనార' ఆంధ్ర నాటకాలలో ఎక్కువ పేరు పొందిన విషాద నాటకాలు. ఇవి గాక పూర్వులు నవ్యులు ఇంకా చాలామంది విషాదాంత నాటకాలు వ్రాసారు, వ్రాస్తున్నారు.

షా మొదలైన పాశ్చత్య మహా రచయితలు ఇంకో సిద్ధాంతం లేవదీసారు. నాటకాంతంలో నాయకుడు మరణించనక్కరలేదు. అతను తల పెట్టిన కార్యం సిద్ధించకపోతే చాలు దానిని విషాదాంత నాటకం గానే పరిగణించవచ్చుని. ఈ సిద్ధాంతానికి సరిపోయే నాటకములు కూడా తెలుగులో వచ్చాయి. శివశంకర స్వామి దీక్షిత దుహిత అలాంటి వాటిల్లో ఒకటి. ఇది పద్య నాటకం, ఇందులోని కథానాయకుడు చంద్రమౌళి, నాయిక మంగళాంబ; ఒకరినొకరు గాఢంగా ప్రేమించుకుంటారు. వివాహమాడ నిశ్చయించుకుంటారు. కాని నాయక తండ్రి అప్పయ దీక్షితులు అంగీకరించదు. నాయికా నాయకుల మనోరథం ఈడేరదు. కాని కొన్ని పాశ్చాత్య నాటకాలలలో లాగా వీరు ఆత్మహత్య చేసుకోరు. గుండెరాయి చేసుకుంటారు. "బహుళదుఃఖ ధ్వాంత బంధురంబైన, జీవితంబున దీపశిఖ యేది యింక"- వారికి. మరీ నాటకం విషాదాంతం ఎందుకు కాదు?

ఇలా వివాదగ్రస్తమయిన ఇంకొక నాటకం కన్యాశుల్కం. ఇందులో ఒకరిద్దరికి తప్ప తక్కినవారందరికీ కథ అడ్డంగా తిరిగింది. గిరీశం, బుచ్చెమ్మను పెండ్లిచేసుకుని కుదట పడడం సాగలేదు సుబ్బిని అమ్మి డబ్బుచేసుకుందామనుకున్న అగ్నిహోత్రావధానులు తల పెట్టిన కార్యం సఫలం కాదు లుబ్ధావధానులకు పడుచు పిల్లతో కులికే యోగం పట్టలేదు. రామప్ప పంతులు పని అయిపోయింది మధురవాణి వైరాగ్యంలో పడింది. ఏదోవిధంగా తమ పని సాధించుకుందల్లా సౌజన్యరావు. కరటక శాస్త్రి. మరి యీ నాటకం మోదాంతమా, విషాదాంతమా? హాస్య సంభాషణల మాటున యీ పాత్రల తీవ్రత మనకు గోచరించడం లేదు ఇలా నాయక మరణం లేకుండ కార్యం సిద్ధించని నాటకాలు చాలా ఉన్నాయి

ప్రఖ్యాత రష్యన్ మహా నటుడు ప్రయోక్త స్టానిస్లావిస్కీ విషాద నాటకాలను గురించి జెపుతూ ఒక గొప్ప వ్యక్తి ఆంతరంగిక వేదనే ట్రాజడీ— అని నిర్వచనం చేశాడు. ఈ దృష్టితో చూస్తే తెలుగులో చాలా విషాద నాటకాలు కనిపించడమే గాదు; ఇట్టి నాటిక తెలుగువారు ఎక్కువగా అభిమానిస్తారేమో ననిపిస్తుంది. పౌరాణిక నాటకాలలో ఎక్కువ ప్రజాదరణ పొందిన హరిశ్చంద్ర, చిత్రనళీయం తీసుకుందాం. హరిశ్చంద్రుడు నలుడు రంగం మీద తొలిసారిగా ప్రవేశించినప్పటి నుంచి నాటకం అంతం అయే వరకు మహా వేదన అనుభవించినారే. ఎంతగానో ప్రేమించిన భార్యా పుత్రులను అమ్ముకోవడం కంటె ఎక్కువ వేదన ఏముంటుంది? తన వలచిన కాంతను ఇంకొకరిని పరిణయమాడమని రాయబారం చేయడం మాటలా? నలుని

హృదయంలో ఎన్ని అగ్ని పర్వతాలు పగిలాయో? అలాంటివే సాంఘిక నాటకాలలో అనిసెట్టి 'మావూరు' "చైతన్యమే" ఈ నాటకానికి హీరో, అది పొందే-వేదనే ఇతివృత్తం"–(మావూరు పీఠికలో బెల్లంకొండ రామదాసు)- ఈ వేదన ఇతివృత్తంగా ప్రేక్షకులకు కన్నీరు తెప్పించే నాటకాలలో నాయకుడు మృతి చెందితే నేమి మృతిచెందక పోతేనేమి? ఇవీ విషాద నాటకాలే.

ఇవిగాక పాశ్చాత్య విషాద నాటకాలు. బెంగాలీ, మరాటీ విషాద నాటకాలు శ్రీపాద కామేశ్వరరావు ప్రభృతులు అనేకులు తెలుగులోకి అనువదించారు. తెలుగునాట విషాద నాటకాలకు ఆదరణ నానాట హెచ్చుతూనే ఉంది.



శాసనం, స్వాతంత్ర్యం ఒద్దికలో ఉన్నమేరకు మానవ సమాజం వాస్తవంగా అభివృద్ధిచెంది సత్త్వ సంపన్న మవుతుంది. ఆధ్యాత్మికంగా మానవుడు తోటి మానవునితో ఒకటి కావడం నేర్చుకున్నప్పుడు అది పరిపూర్ణమవుతుంది. అతని సమాజం యొక్క స్వతస్సిద్ధమైన శాసనం. ఆత్మ శిక్షితమైన అంతః స్వాతంత్ర్యానికి బాహ్యరూపంగా మాత్రమే ఉంటుంది.

– అరవిందుడు.

* * *

ప్రపంచంలో బాధలు ఉన్నాయని తెలుసుకొని, వాటి మూలము. నివారణోపాయము, నిరోధముల గురించి తెలుసుకున్న వారు నాలుగు గొప్ప సత్యాలను తెలుసుకొన్నట్లే. అట్టి వారు సరైన మార్గంలో నడుస్తారు

—— బుద్ధుడు



తిరుపతిలో యాత్రిక సమాచార కేంద్రం 17-5-60 న రాష్ట్ర గవర్నరుచే తెరువబడింది (23వ పేజీ చూడుడు)



భారత ఉపాధ్యక్షులు డా. ఎస్. రాధాకృష్ణన్ 8-5-60 న గ్రామ సేవిక విద్యాలయం శిక్షితుల నుద్దేశించి వీడ్కోలు-ప్రసంగం చేస్తున్న దృశ్యం (ఈ విద్యాలయం హైదరాబాదుకు సమీపంలోగల హైదర్‌షాకోటలో ఉంది)



సింగరేణి బొగ్గు గనులు- పని జరుగుతున్నది.



ఉత్తమ గ్రామస్థాయి కార్యకర్త: 1959-60 లో రాష్ట్ర స్థాయిలో ఉత్తమ గ్రామస్థాయి కార్యకర్తగా రొక్కం బహుమతి పొందిన శ్రీ పి. వీరయ్య—గుంటూరు జిల్లా నాదెండ్ల బ్లాకు సొలాసా వర్గం గ్రా. సే. కా.



ఈత విద్యా శిబిరం: 10-5-60 న హైదరాబాదులో ఆంధ్ర ప్రదేశ్ ఈత విద్యా శిబిరం ముగింపు ఉత్సవం సందర్భంలో ఈత గాండ్రకు రాష్ట్ర ముఖ్య మంత్రి శ్రీ డి. సంజీవయ్య పరిచయంచేయ బడుతున్నారు.









'ప్రైజ్ బాండ్లు—మీ భవిష్యత్తు'.

—'శంకర్స్ వీక్లీ'

# త్రయి

— యస్వీ జోగారావు

సర్వకావ్య సరస్వతీ
ప్రాభాతిక వైతాళిక
నవగీతిక

జగదేక మహాకవి వా
ల్మీకి మౌని లేఖినీ మ
నస్సుమనో రసాయనము
రామాయణము
అది
రసచర్వణ పరాయణము
నా మనస్సుమన స్సుభగ
నవోషస్సు

*　*　*

వేదవ్యాసోపజ్ఞము
వేదాంత సుధాసారము
బోధకళాకౌశల పేశల పారము
ప్రాక్తన భారత సంస్కృతి
భాండారము
పరిణత మానవ ధార్మిక
సంసారము
రసానంద సామ్రాజ్యము

సదాహృదయ సన్నిహితము
నా ప్రేయసి నా దైవము
నాకుసంతతారాధ్యము
మహాభారతామ్నాయము

భారతీ తీర్థంబు బాదరాయణమౌని
సాధు మేధా సహస్రార ధార
శుకముని ముఖ వినిస్స్రుతసుధా పూరంబు
రసనిర్భర కవితా రామసరసి
భక్తి భావ తరంగ బంధురాపగ, భగవ
ద్దివ్య గుణగణ వర్ణనా మ
హార్ణవ మ్మపవర్గహావ మార్గమది మహా
భాగవతము నాకు భావగతము

— (నా 'ఉపనిషత్తు' అను కావ్యము నుండి)



నీకు జరిగిన అపకారానికి ప్రతీకారం చేయకు. పగతీర్చుకున్న ఆనందం క్షణికమైనది. కాని క్షమాగుణం కీర్తి శాశ్వతమైనది. ఎంత అపకారం జరిగినా, పగతీర్చు కొనేందుకు మాత్రం ప్రయత్నించవద్దు.

— స్వామి తిరువల్లువార్

* * *

మనం ఏమిచేయ గలిగి ఉండేవారమో, దానితో చేసిన దానిని పోలిస్తే ఎంతో సిగ్గుగా ఉంటుంది.

— సామ్యూల్ జాన్సన్

# పైన

— రాజబాబు

(తూర్పు గోదావరి జిల్లాలో కాకినాడ తాలూకాలో పైన అనే గ్రామం ఉంది. ఆ గ్రామానికి ఆ పేరు ఎందుకు వచ్చిందో తెలియచేసే కథ)

పైన అనగానే ఆశ్చర్యముగా ఉంటుంది. ఏ ఊరు అని అడగగా పైన అంటె, ఆకాశము మీదకు చూచిన వారెందరో కలరు. పైన అనే గ్రామము తూర్పు గోదావరి జిల్లాలో, కాకినాడ తాలూకాలో, గొల్లపాలెం సమితిలో, కాకినాడకు 12 మైళ్లలో కలదని ఎరుగుండే వారు చాలా తక్కువ.

ఈ గ్రామపు జనాభా 1300. ఒక కోఆపరేటివ్ రూరల్ బేంకు. (2) వెటర్నరీ ప్రథమ చికిత్సా కేంద్రము. (3) మాతా శిశు సంరక్షణాలయము (4) రెండు పాఠశాలలు (ఒక్కొక్క పాఠశాలలో ఇద్దరు ఉపాధ్యాయులు కలరు) (5) తపాలా ఆఫీసు (6) సంతమార్కెటు (ప్రతి లక్ష్మీ వారము పెద్ద సంత జరుగుతుంది ) (7) పంచాయితీ కోర్టు (8) 12 విద్యుత్ వీథి దీపములతో, తీర్చి దిద్దిన వీధులతో విలసిల్లే గ్రామ పంచాయితీ బోర్డు కలవు. పైన గ్రామము గొల్లపాలెం సమితిలో ఆదర్శ గ్రామమనిపించుకొంది పైనగ్రామమని పేరు ఎందులకు వచ్చినదో తెలుసుకుందాము.

మూడు శతాబ్దాల క్రితము ఇప్పుడున్న పందలపాక అను గ్రామములో కొన్ని క్షత్రియుల కుటుంబములుండెడివి. అప్పటికి గోదావరికి ధవళేశ్వరము వద్ద ఆనకట్ట కట్టలేదు. అందుచే ఇవి అన్నియు డెల్టాప్రదేశము కాలేదు. అప్పటికి ఈ ప్రాంతాలలో కొన్ని మెరకవ్యవసాయము ఉండెడివి. దుప్పులు, లేళ్లూ సంచెరించుచుండెను.

పందలపాకలోగల ఒక రాజుగారు వేటకై గుఱ్ఱము మీద, కూడా వేటకుక్కను తీసుకొని, ఇప్పుడు పైన గ్రామముగల ప్రదేశమునకు వచ్చిరట. ఇప్పటి పైనగల ప్రదేశములో మఱ్ఱి చెట్టువద్ద ఒక కుందేలు, ఆ కుక్కను అటకాయించి ముందుకు పోనివ్వలేదు. (ఆ మఱ్ఱి చెట్టు ఇప్పటికీకలదు). అప్పుడు ఆ రాజుగారు ఆ చెవలపిల్లిని వేటాడడము మాని చాలా ఆశ్చర్యపడి. ఇది చాలా పౌరుషముగల స్థలము ఈ ప్రదేశములో చెవలపిల్లికే ఇంత పౌరుషముంటె, మనుష్యులకెలా ఉంటుందని, ఆయన పొలము ఈ ప్రాంతాలలో ఉండుటచే ఆయన ఇచ్చటకు వచ్చి గృహము కట్టుకున్నారు.

ఆ రాజుగారి బంధువులు పందలపాక వచ్చి ఎచ్చటఉన్నారని అడుగగా ఆ "పైన" ఉన్నారు వెళ్లండి అనేవారట. తరువాత ఆ రాజుగారి పనివాళ్లు కూడా వీరింటి వద్ద ఇళ్లు కట్టుకున్నారు. తరువాత ధవళేశ్వరము ఆనకట్ట కట్టడము. కాకినాడ కాలువ. ఈ రాజుగారి ఇళ్ల సమీపాన్నుంచి వెళ్లడము, డెల్టా అవ్వడము జరిగినవి. అందుచే జనాభా పెరిగి ఇప్పటి పైన గ్రామమయినది.

ఇప్పటికీ చూస్తూంటె పూర్వము గొప్ప ఔన్నత్యముగల గ్రామములాగ కనుపిస్తుంది. తీర్చి దిద్దినపెద్ద విశాలమైన వీధులు ఎత్తయిన పాతమట్టి దిబ్బలమీద వెడల్పయిన గోడలతో భవంతుల లాగున కనుపించే ఇళ్లూ చూస్తుంటె. పురాణాలు జ్ఞప్తికి వస్తాయి.

నాటిక:

# "ప్రణాళికారోహణ"

— అన్నపరెడ్డి రాఘవరావు

## పాత్రలు

| | | | |
|---|---|---|---|
| 1. | వినాయకరావు | .... | షావుకారు |
| 2. | కాంతయ్య | .... | రైతు |
| 3. | వెంకట రత్నం | .... | రైతు |
| 4. | సారధి | .... | V. L. W. |
| 5. | ప్రకాశ్ | .... | షావుకారు కొడుకు |
| 6. | వివేకానంద్ | .... | రైతు కొడుకు |

(వినాయకరావు అటూ ఇటూ తిరుగుతూ ఉంటాడు)

డబ్బు తీసికెళ్లేప్పుడేమో సరదా. యివ్వవలసి వచ్చేప్పుడు ఏడ్పు ముఖాలు వీళ్లన్నూ - పెళ్లి ఆగిపోతుందని ఒకరు, అబ్బాయి ఉద్యోగాన్వేషణకని ఒకడు, తహశీలుకు, ఎరువులు కొనుక్కోవలెనని మరి కొందరు ఈగలు ముసిరినట్లు ముసురుతారు. చేతిలో పడే వరకు ఎన్ని షరతులకైనా తల వూపుతూ పని అయిన తరువాత మనిషి వత్తా యుండదు. (వెనక ఎవరో వచ్చినట్లుగా ఉంది వెనకకు తిరుగును)

కాం:- (కాంతయ్య ప్రవేశిస్తూ) నమస్కారమండి.

వి:- ఆ, ఆ, ఏమిటి కాంతయ్య పనిమీద వచ్చావ్— రాఖమేమైన....

కా:- ఏదో ముఖ్యమైన పనివుంది రమ్మని నర్సయ్యతో చెప్పారటగా?

వి:- ఆ! అవును మర్చాను. ఇదిగో! డబ్బు మాట ఎటున్నా నీవేనయం వస్తూపోతూ యుంటావు. చంద్రయ్య చూడు అసలు చాల్తీ కనిపిస్తాడేమో.

కా:- అలా అయితే ఎలగండీ. తీసుకున్న తర్వాత మీకు దాసోహము చేస్తూ, తిరగాల్సిందేగా. ఈ మీ, మా వ్యవహారాలు అనాది నుంచీ వస్తున్నవేగా.

వి:- ఆ ఏమిరావడం—ధనికుడు, బీదవాడు అనే భేదాలు మంటగలసి, కుల మత వితక్షలు కూలిపోయి, హోదాగల మాకు, మీకు వున్న దూరం దగ్గరకు వచ్చేస్తూవుంది. నోటు గడువు దాటినా వసూలుకు గడప దాటడం ప్రాణ కంటకముగా వుంది—అయినా కాలం మారి పోయిందిలే—

కా:- కాలం మారటం లేనివాడు బాగు పడటం అంటే ఎందుకండీ మీకీ కడుపు మంట.

వి:- (కోపంగా) కాంతయ్యా! కడుపు మంటతో మా పంచలపడి మా కోసం కాసుకొని కూర్చున్న రోజులు జ్ఞప్తికి తెచ్చుకో.

కా:- రోజులు మారినాయ్.

వి:- అవున్లే లేకపోతే కాంతిగా, అనే నిన్ను కాంతయ్య అనే ఖర్మమొచ్చింది? మీ తండ్రి మా తండ్రి వద్ద నీ మాదిరిగా యుండేవాడా ? చెప్పిన మాటకు అడ్డున్నదా ? గీచిన గీటు దాటి పోయెవాడేనా ?

కా:- ఎందుకు దాటడం ? నా తండ్రి త్రాగుబోతు — రోజూ డబ్బిచ్చి మత్తుగా త్రాగించి అక్షరజ్ఞానం లేని కారణంగా చూసి. మీ మాయ మాటలు తెలుసుకో లేక పోయి. మీరు చెప్పిందే వేద వాక్కుగా నమ్మితే—మీ యిష్టమొచ్చినప్పుడల్లా వేలి ముద్ర లేయించుకొని వున్న భూమిని స్వాధీనం చేసుకొన్నందుకు అనుభవించాడు.

వి:- ఏమిటి ! కావలసివస్తే కాళ్లావేళ్లా పడటం—చివరకు మేం మోసం చేశామని కుంటి సాకులు చెప్పటం—మీ అలకారకానికి బాగాఅలవాటయింది—యేం, మేం అక్రమంగా మీ ఆస్తిని అనుభవిస్తున్నామా?

కా:- అక్రమంగా గాని క్రమంగా గాని పోయింది. అవి మీ రోజులు—ప్రభుత్వము మద్యపాన నిషేధం పెట్టకుంటే ఇళ్లు, ఒళ్లు గుళ్ళయి ఇదీ మిగిలేది కాదు—వయోజన విద్యాపాఠశాల పెట్టకుంటే మేము మీ చేతిలో చిక్కుకునే వాళ్ళం—ఆ దొంగ నోట్ల బాధ కూడ తప్పింది.

వి:- నీవూ, నావద్ద అప్పు చేసావు. అదీ మమ్మెద్దరి స్తావికేనా ?

కా:- అవును, నేను పొరపడ్డాను. నా తండ్రి తెలియక అప్పుల పాలయితే—నేను అబ్బాయి పెండ్లి అందరిలా ఆర్భాటంగా చెయ్యాలని, బుద్ధి గడ్డితిని, అప్పులపాలయితే, వలలో చిక్కుకొన్న జంతువులా గతి గానక తిరుగుచున్నాను.

వి:- ఆ, అబ్బాయి పెండ్లితో ఒక అంతస్తు పైకి పోవాలని ఆశతో అమ్మాయి పెళ్లి సంగతే మర్చావు—అవున్లే ఆడపిల్లకేం తొందర.

కా:- అబ్బాయికి వచ్చే కట్నంతో అమ్మాయి పెండ్లి చెయ్యాలని ఉద్రూతలూగాను వాడు ప్రేమ వివాహం చేసుకుంటే వాడి ఆశయాలతో నా ఆశలు నాశనమయ్యాయి. అయినా వరకట్న నిషేధం పుణ్యమా అంటూ నాకా బాధ తప్పింది.

వి:- కాంతయ్య ! కట్నం కాక పోతేనే ? దాన్ని ముందుగనే బహుమానంగా స్వీకరిస్తారని. తెలుసుకో— అయినా అవన్నీ అమలు జరిగినప్పటి మాటలు.

కా:- అమలు జరిపేది ప్రజలే చట్టాలు కాదు—ఏదైనా ప్రజాదరణమీదే ఆధారపడి యుంటుంది. ప్రణాళికలంటే ఎగటుగా తోచి, మొరటుగా ప్రవర్తించాను మొదట.

వి:- సరి ! సరి ! ప్రణాళికలా (నవ్వు) కల్ల బొల్లి కబుర్లు చెప్పే ఈ ప్లానింగు వాళ్ళ మాటలు నమ్మి—ప్రణాళికల ఊబిలో దిగి. పూర్వ సాంప్రదాయాలకు అడ్డు రాకు—దొరికిన చోటల్లా అప్పులు తెచ్చి, మన నెత్తిన రుద్దుతూ, డబ్బంతా హారతి కర్పూరంలా హరింప జేస్తున్నారని గ్రహించు.

కా:- గ్రహించాను.

వి:- ఏమని ?

కా:- ఇవి గిట్టక చెప్పేమాటలని.

వి:- కారణం ?

కా:-కారణాలకేః కల్పించుకుంటే కావలసినన్ని యుంటాయ్. మీ ప్రకాశ్‌కు ఉద్యోగంలేదని—ధనికుని దరిద్రుని ఒడుదుడుకులులేని ఒకే నావలో నడుపుతున్నారని— వడ్డీలకు పైవడ్డీలు చక్రవడ్డీలు గుంజే మీ వ్యాపారాలు కుంటుబడ్డాయని.

వి:- కాంతయ్యా మితిమీరి మాట్లాడుచున్నవు. ఎక్కడున్నావో ఎవరితో మాట్లాడుచున్నవో తెలుసుకో.

కా:- అవును వినాయకరావుగారు—మీతోనే—బాకీయుండి. చాకిరీ చేసే రోజులు గతించాయ్—దేశం తెలుగు మీరుతోంది—మీ పేరు, మీ మనస్సు మార్చుకోక

తప్పదు. నాయకరావుగా చలామణీ అవుతారేమో చూడండి.

వి:- ఈ నాయకులంతా తూ.చా. తప్పక వ్యవహరిస్తున్నారా.

కా:- ఆ తు.చాలు తూచటానికి ప్రజలు త్రాచులుపయోగిస్తునారు—వినాయకులు నాయకులుగాను—నాయకులే వినాయకులవుతున్నారు. విషమ చక్రంలా తిరుగుచున్నారు. దిక్సూచి యంత్రం ఏల్ల వేళల ఉత్తర దిక్కును చూపించినట్లు వీరందరూ—దేశ సౌభాగ్యమునకు వెన్నెముక రైతేనని. అర్థం జేసుకుంటున్నారు.

వి:- అయితే భూమి ఉన్న ప్రతివాడూ రైతేనే భాగ్యంతుడింత వరకనే కొలమాన మేమైనావుందా.

కా:- అక్కడే పొరబడుతున్నారు. తాతలు సంపాదించిన ధనంతో వచ్చే అక్రమ వడ్డీలతో మానవుల రక్తాన్ని పీల్చి అస్తి పంజరాన్ని మిగిల్చి హంసతూళికా తల్పాలపై ఎ..ళించే వాడుకాదు రైతంటే—తగిన ఫలసాయం రాకపోయినా నిస్పృహ జెందక అదే పొలంలో అదే పంట పండించాలని ప్రాకులాడి రేయి పగలు చమటోడ్చి భూమిలో రత్నాన్ని పండించి, ప్రజల కందించేవాడే

వి:- రైతుకు. ఊడ్పులకు. ఎరువులకు. పెళ్ళిళ్ళకు అడిగినప్పుడల్లా డబ్బు అప్పుగా అందిస్తూ యుంటే పండించడంకూడ ఒక గొప్పేనా? సరే: బాకీ సంగతి ఏమిటి—కోర్టుకు వెళ్ళాల్సివస్తుంది

కా:- అంతేగా—అనుకూలముగా యుంటే ఆదరణ. లేకపోతే బాకీ తీర్మానం కావాలి. అడ్డు చెబితే అధికారులు అందుబాటులో యున్నారని. అభాగ్యుల్ని అగాధాల అట్టడుగుకు నెట్టడం

వి:- అయితే అప్పిచ్చి అడగడం అన్యాయమనా నీ అర్థం ?

కా:- వినాయకరావుగారూ; గ్రామాల్లో వివిధ పార్టీలు కల్పించి, కులమత భేదాలు రేకెత్తించి, రైతుల్ని ఆ వలయాల్లో చిక్కించి, కోర్టుల్లో కోట్లు వెచ్చించి జాతిలో నిజాయితీని పోగొట్టి స్వలాభాల కాసించి, అభివృద్ధి నిరోధకులుగా తయారైనారు- కోట్లున్న వారిని కూలి చేసే వారిని, సమ భావంతో సహాయపడే ఒకేస్థానంలో కూర్చోబెట్టే ప్రణాళిక లొచ్చాయ్, కొండలు లోయలు తారుమారవుతున్నాయ్.

వి:- ప్రణాళికలు, పథకాలు మీ కు, మీరనుభవిస్తే చూస్తుంగా, ఈ ప్రసంగం అనవసరం. పైకం చాల అవసరం.

కా:- ప్రణాళికలంటే తెలుసుకోవడం ఎంతైనా అవసరం. రైతంటే దాతి విగ్రహం తలంచి అప్పిచ్చి, అనాదిగా మా రైతు మీ భాగ్యవంతుల తలంపుల్లో మార్పు ఎంతైనా అవసరం—ప్రణాళికలంటే ప్రజల పాలిట కామధేనువని ప్రజలంతా తెలుసుకోవడం చాల అవసరం వినాయకరావు గారు వస్తాను (వెళ్లిపోతాడు)

వి:- (ఏకాంతంగా ఆలోచిస్తూ) కాంతయ్యలో. ఏమిటి మార్పు లోగడ చేతులు నలుపుకుంటూ వచ్చినట్లు పడియుండే వాడు. ఇప్పుడేదో అమూల్యమైన వస్తువు చేతికందినట్లు గర్విస్తున్నాడు (ఆలోచిస్తూ) ఓ! హో! ప్రణాళికా ప్రచారం జోరుగా సాగుతూ వుంది మన మేడలు. ఊహలు కూలేటట్లున్నవి.... అయినా మన కెందుకా చింత. ఎన్ని రోజులు తింటె తరిగని ఈ ధనలక్ష్మి అండగా యున్నదిగా (గడియారం చూసుకొని) క్లబ్ కు టయిం అయిందే (అంటూ లేవబోతుండగా సారధి V.L.W. ప్రవేశిస్తాడు.)

సా:- (నమస్కరిస్తూ) నమస్కారమండి!

వి:- (తిరిగి నమస్కరించకుండా) వాటికే ఊరికే పెట్టేవేగా—నమస్కారమనటం — థ్యాంక్స్ అనడం బాగా అలవాటయింది అందరికిని

సా:- నేను నిన్న వచ్చినప్పుడు ఇంటి వద్ద లేరు....

వి:- హుం హుం. నీ వస్తావని కూర్చోవాలి గాబోలు—తెలియదురే—యేం ?

సా:- అది కాదండి.

వి:- ఏది కాదయ్యా, ఎన్నిసార్లు చెప్పాలి నీకు, నీవు నాకేమి చెప్పొద్దనీ, నీవు చెప్పేవి నచ్చవని, నచ్చినా ఆచరించననీ.... ....

సా:- ఆచరిస్తే, ఈ క్రొత్త పద్ధతిలో భేదం మీకే కనిపిస్తుందండి.

వి:- ఆచరణ లేదు అలవాటు లేదు ఆవపయ్యా అంత వరకు, బయలుదేరావు నేటికి దేశ మరామత్తుకు, గ్రుడ్డొచ్చి పిల్ల నెక్కిరించినట్లు నీవా మాకు నీతులు గరిపేది.

సా:- నే చెప్పేవి నీతులు కాదండి, చేసే పనిలో మార్పులు మాత్రమే మంచివైతే గ్రహించండి, లేదా ఈ విధంగా నడవమని సలహా లివ్వండి.

వి:- మంచీ, చెడూ తర్కిస్తూ కూర్చోవటానికి నీ మాదిరిగా చెట్లంబడి, పుట్లంబడి, చేల గట్లంబడి తిరిగే వాడిననుకున్నావా యిచ్చిన బాకీలకు చచ్చేట్లు తిరిగి వచ్చేట్లు చూసుకోవటానికే చాలటం లేదు కాల సంతాను. అయినా ఏమిటి నీవు సాధించే ఆ ఘన కార్యం.

సా:- మీ పల్లపు చేలో జపాను పద్ధతి వరిసాగు వేయించాలని.

వి:- సరే! బాగానే వుంది....అమెరికా రష్యాల డబ్బుతో జపాను, చైనా పద్ధతులు మన భూముల్లో ప్రయోగాలు చేయవల్సిన దౌర్భాగ్య మేమొచ్చిందిప్పుడు.

సా:- ఏ దేశ పద్ధతి అయితేనే — మనకు కావలసిన ఆహారధాన్యాలు ఎక్కువగా ఉత్పత్తి చేసుకోవడం- కరువులు రాకుండా కాపాడుకోవటానికి.

వి:- అవునులే ఏ రాయి అయితేనే పళ్లూడగొట్టుకోవటానికి- ఉచితంగా ఏమైనా ఎరువు యిచ్చే ఏర్పాట్లు వున్నాయా!

సా:- చదువుకున్న మీరూ అలా అడిగితే ఎలాగండీ.

వి:- అయితే ఈ ఊక దంపుడు ప్రసంగం చదువురాని వాళ్ల దగ్గరే యిస్తే—నీకేమైనా లాభ ముంటుందేమో కాని నా దగ్గర ఉడకవు ఆ పప్పులు.

సా:- వారికీ తెలియజేస్తున్నాను. ముందు మీబోటి వారు గ్రహించి ఆచరిస్తే వారు కూడ ముందుకు రావటానికి ప్రోత్సహించిన వారవుతారు. అధికాహారోత్పత్తికి తోడ్పడినవారవుతారు.

వి:- ఎక్కడ పట్టారయ్యా ఈ మాటలు—అధికాహారోత్పత్తి సమిష్టి వ్యవసాయం. సర్వీసు కోపరేటివ్ సంఘాలు.... ఈ దేశ మరామత్తు లేకనే గాబోలు మన పూర్వీకులందరూ పరలోకానికి పారిపోయింది.

సా:- పూర్వానికి ప్రస్తుతానికి చాల తేడా వుంది. జనాభా పెచ్చు పెరగడం వల్ల, సాగు చేసే భూమి పెరక్కపోవటం వల్ల ఆహార కొరత ఏర్పడుతూ వుంది. ఒక వైపు బంజరు భూములు సాగుచేయించుట మరొకవైపు సంతాన నియంత్రణ ప్రవేశబెట్టి డబ్బు పొదుపు చేసుకోవల్సిన పరిస్థితి ఏర్పడింది.

వి:- సంతాన నియంత్రణ కాకపోతే ఒకేసారి నరహత్యలు పెట్టించ కూడదు, జనాభా తగ్గుతుంది. రాజారామమోహన్‌రాయ్ పుట్టి శిశు హత్యలు తగ్గిస్తే మీరు సంతాన నియంత్రణ ద్వారా దానిని ప్రోత్సహిస్తున్నారు. ఎందుకయ్యా ఆ పాపం కూడను.

సా:- ఈనాటి సాంఘిక, ఆర్థిక వ్యవస్థలో ధరలు పెరిగి జీవనం కష్టమౌతూవుంది ఎక్కువ పిల్లలుండుట కంటే వేరే నరకం లేదు. మూఢ విశ్వాసాలు మాని ప్రస్తుత ఆవశ్యకత తెల్సుకొని నూతన పద్ధతి, పనిముట్లు ఉపయోగిస్తూ అధిక ఫలసాయానికి కృషి సల్పాల్సి వుంది.

వి:- ఏ పద్ధతియైనా ఆ పద్ధతికి అదనం అయిన ఖర్చుకు వచ్చే కిమ్మత్తుకు మాత్రమే సరిపోతూ వుంది. లాభమేముంది. నీ మాటలు నమ్మదగ్గవేనా, భూమికి, ఆకాశానికి ముడిపెట్టి కబుర్లు చెప్పే నమ్మే పిచ్చాళ్లెవరున్నారు.

సా:- మనకు కావలసినది నగలు, నాణ్యాలు కాదు.... తిండి గింజలు పెట్టుబడికి సరిపోయినా ధనం బదులుగా ధాన్యం మిగులుతుంది అవి మరికొందరికి జీవనాధారం అవుతుంది. జాతీయ ఆదాయాన్ని కూడ పెంపొందించిన వారమవుతాం.

వి:- చచ్చేవాడిని అడ్డుబడితే ఆగుతాడా. నాకున్నది నాకు చాలు. అధిక ఉత్పత్తిని గూర్చి నావద్ద హెచ్చరించక నీపని చూసుకో...నాకు చాల పని వుంది.

సా:- మరల కలుసుకుంటానండి. (వెళ్ళిపోతాడు)

వి:- వదిలేట్లు లేదే—మూలనున్న ఈ గ్రామానికి కూడ వచ్చి పడిందే ఆ ప్రచార దెయ్యం.

2—వ భాగము

(ప్రణాళికల చార్టులు తగిలించి యుంటాయి, ఏదో వ్రాస్తూ ఉంటాడు సారధి)

(వెంకటరత్నం ప్రవేశం)

వెం:- నమస్కారమండి

సా:- నమస్కారమండి వెంకటరత్నంగారూ! కూర్చోండి. (అంటూ బల్ల చూపుతాడు)

వెం:- ఎక్కడనుండి బాబు ఉదయం అలసిపోయి వస్తున్నారు.

సా:- వినాయకరావు గారి యింటి వద్దనుండి.

వెం:- వారింటికే-"ఎద్దెం అంటె తెద్దెం" అంటూ ప్రతి దానికి డొంకతిరుగుళ్ల పెడుతుంటాడు ప్రతిమాటకు ఏదో తేనిపోని.

సా:- దాందేముంది వెంకటరత్నంగారు కొందరు త్వరలో అర్థం చేసుకుంటారు-మరికొందరు ఎక్కువ కాలం తీసుకుంటారు.

వెం:- అవున్లే బాబు—క్రొత్త పద్ధతి అంటే పంట పాడవుతుందని లేని వాడి భయం—ఉన్నవాళ్ళకేమో మనది మనకు చాలదా అనే అహంభావం—మీరు మొన్న రైతులందరిని సమావేశపర్చి మీటింగు పెట్టిన రోజున నేను ముందుకొచ్చినందుకు— అబ్బో అని అందరూ హేళనగా మాట్లాడారు.

సా:- మీరు ఉత్సాహంగా ముందుకొచ్చినందుకు సంతోషం. మిమ్మల్ని చూసి వాళ్ళకుకూడ అభిరుచి తప్పకుండ కలుగుతుంది.

వెం:- మీ మాట నమ్మాను పాల ముంచినా నీట ముంచినా మీదే భారం.

సా:- మీకు నష్టమైతే మా కిష్టమా వెంకటరత్నంగారు ఏ పద్ధతియైనా జాగ్రత్తగా పరిశీలించిన తరువాతనే మీ ముందుకు వస్తుంది.

వెం:- మీరు చెప్పినట్లుగా పచ్చి రొట్ట వేసి, బాగా దమ్ము చేసి ఊడ్పుకు సిద్ధంగా యుంచాను. ఊడ్పు అయిన తరువాత ఏమి చెయ్యాలంటారు.

సా:- కలుపు తీసే సమయంలో జపాను ప్రష్హో ఉపయోగించాలి. తగుమాత్రంగా ఎరువు వేయాలి. క్రొత్తవేరు పుట్టి దుబ్బు చేస్తుంది.

వెం:- (ఆశ్చర్యంగా) వేరు తెగితే నారు వేయకూడదుగా

సా:- అవును. నారుకు వేరుత్రెగ కూడదు. కాని యిక్కడ క్రొత్తవేరు వచ్చి దుబ్బు బాగా చేసి, అధిక ఫలసాయానికి దోహద మిస్తుంది. నారు ఎలావుంది. భేదం కనిపించలా మరి.

వేం:- కనిపించకేంబాబు, మీ రిచ్చినవే మేలైన విత్తనాలని అందరూ యిప్పు డనుకుంటున్నారు. నవ్విన నాప చేను పండిందనే సామిత సరిపోయింది.

సా:- మన చేను ఊడ్పురోజు, మన వాళ్ళందరినీ తీసుకొస్తే మంచిది వాళ్లకూడ, ఆ పద్ధతి, తెలుసుకుంటారు.

వెం:- అలాగే తీసుకొస్తాను బాబు, వస్తాను. (వెళ్తాడు) (మరల వ్రాతలో యుండగా కాంతయ్య ప్రవేశిస్తాడు. ఒకరికొకరు నమస్కరించుకొన్న తరువాత బల్లమీద కూర్చుంటాడు)

సా:- ఏమండి కాంతయ్యగారు,

కాం:- మీరు పూర్తి చేయించిన ఫారం. భూమి తనఖా బ్యాంకులో యిచ్చిన దాని విషయము ఏమైందో తెలుసుకుందామని.

సా:- Bye-lawను బట్టి 8 వందలు యిస్తారు 15 వాయిదాలలో తీర్చుకోవాలి

కా:- నా బాధ తీర్చారు.

సా:- ఏమిటది?

కా:- వినాయకరావు గారివద్ద అప్పుచేశాను. యిప్పుడు గొంతుక మీద కూర్చున్నాడు.

సా:- ఎక్కువ వడ్డీలకు అప్పులు తెచ్చుకొని బాధ పడకుండా ప్రతివారిని సొసైటీలలో మెంబర్లుగా జేర్పించి, అందరికి అందుబాటులో యుండే అనేక రకముల సొసైటీలు ఏర్పాటు చేసారు

కా:- రైతుల అగచాట్లు కొంతవరకు తీరినట్లే.

సా:- అంతేగాక, పండిన పంటను కళ్ళాల్లో కక్కుర్తికి

ధర తక్కువకు అమ్మి నష్టపోకుండా సొసైటీలలో గోడౌన్స్ నిర్మించారు, పండిన పంట భద్రము చేయబడుతుంది.

కా:- సొసైటీలలో పూర్వము నాబోటి వారికి చోటుండేది కాదు. ప్రెసిడెంట్ల చుట్టాలకు, స్నేహితులకే వచ్చిన డబ్బంతా సరిపోయేది. వాళ్లు తీర్చక పోయినా అడిగే వాళ్లు లేరు.

సా:- ఆ తారతమ్యాలు తారుమారయ్యాయ్. ఎవ్వరికైనా అవసరాన్ని బట్టి అప్పిస్తారు. ఎరువులు, విత్తనాలు కొనుక్కొనే వాటికి ప్రాముఖ్యత యిస్తారు.
(వివేకానంద్ వస్తాడు కాంతయ్య కొడుకుని చూసి) ఏరా యిటువచ్చావ్? నా కోసమేనా?

వివే:- సారధి గారి కొరకు నాన్నా.

కా:- వీడు యిటు వ్యవసాయానికి, అటు ఉద్యోగానికి పనికి రాకుండా యుండి, నాటకాలని, మీటింగులని, తిరుగుతూ నా అభిప్రాయముతో ఒక్కొక్కసారి ఏకీభవించడు

సా:- చదువుకున్న వాళ్ళకు ఉద్యోగం లేదని, చదివించిన వారికి కష్టం లేకుండా ప్రభుత్వము చిన్నప్పటినుండి స్కూల్స్‌లో వృత్తి విద్యలు ప్రవేశపెట్టింది. అభిరుచిని బట్టి వృత్తి విద్యలో ప్రవీణులయ్యే అవకాశములు ఏర్పాటు చేయ బడ్డాయి

కా:- చదువుకొని, పై చదువులు చదవలేక చాలించిన వారికి ఈ జగతిలో ప్రగతి లేనట్లేగా.

సా:- కుటీర పరిశ్రమల ద్వారా నిరుద్యోగ సమస్య పరిష్కరించవచ్చు

వివే:- సారధిగారు ఈ రోజు వనమహోత్సవ సందర్భమున రామాలయము వద్ద బహిరంగ సభ ఏర్పాటుచేశాము.

సా:- మంచిది

వివే:- మీరు ముందుగా వచ్చి మాకు సలహాలు ఇవ్వాలి. సభా నంతరం "కీటక నిర్మూలన" అనే నాటిక ఏర్పాటు చేస్తున్నాము.

సా:- నే రావటానికి ...

వివే:- ఏమిటి అభ్యంతరం

కా:- పనేదైనా వుందేమో— సారధి గారికి ఒకవనా. రోజూ వంద విషయాల్లోనైనా తల దూర్చాలి.

సా:- కాదండి ఇంతకు ముందు గోపాల్ వచ్చి వాళ్లొక మీటింగ్ ఎర్పాటు చేసి. దానికి రమ్మన్నాడు. పెద్ద చిక్కులో పడ్డాను.

కా:- చిక్కేముందండీ. మీరు మన మీటింగుకు రండి.

సా:- ఒక చోటకు హాజరైతే రెండవ పక్షమువారు నేను పక్ష పాతము చూపినట్లుగా కక్షబూని, మనస్సులో కష్టపెట్టుకుంటారు.

వివే:- తరచుగా సభలు, సమావేశములు జరిపితే ఐక్యమత్యము పెంపొందు తుందనేవారు, ఈ వన మహోత్సవాన్ని జరుప ప్రోత్సహించి. నిరుత్సాహ పర్చుచున్నారే.

సా:- నా యుద్దేశము గ్రామములోని కక్షలు, వితక్షణలు రూపు మాపి, ఒకే మార్గాన నడిపించాలని తలంచే నేను ఒకరికి భాగస్వామినౌట భావ్యంకాదు.

కా:- అలాగే కానివ్వండి. నేను వస్తాను, (వెళుతూ) రా ఆనంద్,

విశ్వ:, నీ వెళుతూ వుండు నేనొస్తాను. (కాంతయ్య వెళ్లిపోతా)
చదువు కున్నందుకు ఉద్యోగం లేకపోగా విశాల హృదయంతో కట్నానికి ఆశ జెందక ప్రేమించిన పిల్లను పెళ్లి జేసుకున్నాను.నాపై నున్న మక్కువచే ప్రస్తుతం. మా నాన్న ఏమీ అనక పోయినా ఇంత వాణ్ణి అయ్యాక ఏదారి తెలియకుండావుంది నా జీవితం.

సా:- చదువు కున్నది జ్ఞానానికేగా,

విశ్వ:- జ్ఞానమున్నంత మాత్రాన భుక్తికి మార్గమేది. ఇంత చదువు చదివి పొలము వెళుతూవుంటే నల్గురూ నవ్వుతారు. నిరుద్యోగిగా తిరిగితే మరోలా అర్థం జేసుకుంటారు. అపవాదులుకూడ అనేకం కల్పిస్తారు.

సా:- ఎవరో ఏదో అనుకుంటారని భవిష్యత్ నాశనము జేసుకోవటం పొరపాటు. ఉద్యోగ వృత్తికాకపోతే మరోవృత్తికి దారి తీయాలి.

వి:- ఏ వృత్తికైనా వేలకు వేలు పెట్టుబడి అవసరమేగా.

సా:- తక్కువ పెట్టుబడితో ఎక్కువ లాభాలు పొందే అనేక వృత్తులున్నాయ్. కుటీర పరిశ్రమల ద్వారా సుఖ జీవితం గడపవచ్చు కోళ్ల పరిశ్రమలాంటిది ఏదైనా ఆలోచింపవచ్చును. నీవు కొంత పెట్టుబడి పెడితే బ్యాంకు ద్వారా కొంత సహాయం యుంటుంది.

వి:- అయితే దాని విషయం మాట్లాడదాం రేపు కలుసు కుంటాను. మీటింగు కూడ ఒకే స్థలంలో జరిగే ఏర్పాట్లకు ప్రయత్నిస్తాను వస్తాను.

సా:- నీలాంటి వివేక వంతులైన యువకులు ముందుకు వచ్చి ప్రజల్లో ప్రణాళికల లక్ష్యాలను ప్రచారం చేయ వలసియున్నది.

3—వ భాగము

( వినాయక రావు పేపరు చదువుతూ యుంటాడు, ప్రకాశ్ ప్రవేశం )

ప్ర:- నాన్నా !

వి:- యేం ?

ప్ర:- సారధి ఎన్ని పర్యాయములు మన ఇంటి చుట్టూ తిరుగుతున్నా తగిన సమధానం చెప్పవే.

వి:- ఎవడి కోసం తిరుగుతున్నాడంటావ్. డైరీ నింపు కోవటానికి తిరుగుతాడు. యే తిరిగినా నీ మాదిరిగా తిరగడం లేదు, ఏదో సంపాదిస్తూ వున్నాడు.

ప్ర:- నిరుద్యోగిననే బాధతో యిప్పటి వరకు యదార్థము తెలుసుకోలేక పోయాను.

వి:- ఏమిటోయ్ నీవిప్పుడు తెలుసుకున్న ఆ యదార్థం.

ప్ర:- దొంగ అంకెలతో కాలం గడుపు చున్నారని అపార్థం జేసుకోవడం

వి:- అంకెలు నింపుతూ ఈ ప్రణాళికలు నిలబెట్టుకొనక పోతే జీవనాధారం పోయి. వేరే ఆధారం లేక నీ మాదిరిగా తిరగాల్సిందే.

ప్ర:- అవన్నీ పనికిమాలిన మాటలు. ఒట్టి పుకార్లు నాన్న.

వి:- కారుల్లో షికార్లు కొడుతూ, ప్రణాళికా ప్రచారం అంటూ పుక్కిటి పురాణాలు చెప్పడం

ప్ర:- కాదు నాన్నా.

వి:- మ. రే. మి. టి నాన్న !

ప్ర:- ఐదున్నర లక్షల గ్రామాలలోని కుటుంబ జీవిత స్థితిగతుల మార్చి, వారి జీవితాల్లోకి నూతన శోభను తెచ్చేవి—సమాజంలోని అంతస్తుల మధ్య వ్యత్యాసాన్ని తగ్గించి. అందరికి సమాన అవకాశాలు కల్పించేవి--ప్రజల జీవన ప్రమాణాన్ని అధికం జేసేవి—ఈ ప్రణాళిక లేనని తెల్సుకోవాలి,

వి:- పుకార్ల, వాకవ్ చేయటానికేనా. అనవసర విష యాల్లో జోక్యం కల్పించుకోవటానికేనా నిన్ను చదివించింది.

ప్ర:- చదువుకొన్నందుకే కళ్లు తెరచి, ప్రణాళికా విజయ పరంపరలు గమనించాను.

వి:- ఇంతకూ నీవు చెప్పే మాటలు

ప్ర:- యదార్థాలు నాన్నా ! మనకంటే నిరక్షరాస్యులు నయం త్వరలో అర్థం జేసుకుంటారు.

వి:- వాళ్లు ఎటు ఆడిస్తే, అటే ఆడతారు మూర్ఖులు.

ప్ర:- మనం చదువుకొన్న మూర్ఖులమని తెల్సుకోవాలి.

వి:- తెల్సుకోవాలి. తెల్సుకోవాలి. కని, పెంచి, వేలకు వేలు వెచ్చించి చదివించినందుకు నయా పైసా ఆదాయం లేకపోగా తండ్రి యుద్దేశ్యాలను ప్రతి ఘటించే నిన్ను, నిరుద్యోగ సమస్య, ఆహారసమస్య తీర్చలేని ప్రభుత్వ ప్రతిపాదనలు తెల్సుకోవద్దు మరి.

ప్ర:- ప్రభుత్వము. ప్రభుత్వము అంటే అందుకు ప్రభు త్వం ఏమి చేస్తుంది.

వి:- అందరిని చదువుకోమని, ఇతర దేశాల కంటే మనదేశం చదువుకున్న వాళ్లు తక్కువని, ఆ డబ్బా వాయించటం దేనికి.

ప్ర:- చదువుకున్న ప్రతివాడు ఉద్యోగానికి ప్రాకులాడ టంలో అర్థం లేదు. ధనికుడు, దరిద్రుడు అనే భేదంలేకుండా అంతా ఉద్యోగాన్వేషణే

వి:- డబ్బు లేదా ? సిగ్గు లేకపోతేసరి.

ప్ర:- నిజమేనాన్న ! సిగ్గు తెచ్చుకోవాలి. ఇంత ఆస్తి యుండి, యింకా ఉద్యోగంతో సంపాదించు కోవ లెననుకోవటానికి

వి:- లేనివాడు పొట్టకోసం, ఉన్నవాడు హోదాకు— ఉద్యోగం పురుష లక్షణం అని ఊరికే అన్నారా.

ప్ర:- స్త్రీలకు కాదుగాబోలు వాళ్లు పొయ్యేల్లోనే మగ్గా ల్సిన గతనేగా నీ యుద్దేశ్యం.

వి:- కాకపోతే—మహిళా సంఘాలు, మహిళా మండ లాయి స్థాపించాక, స్త్రీలు విచ్చల విడి పెలరేగి, మగడు వచ్చే వేళకు ఇంటి పద్దలేకుండా—ప్రతి విషయానికి మగవాళ్ళతో పోటీలుపడి, బయలు దేరుతున్నారు

ప్ర:- మగడు సంపాదించిన దానిమీద సంసారమంతా ఆధారపడకుండా భార్యలు కూడా సహాకరించడం తప్పా?

వి:- అంతటితో ఊరుకుంటున్నారా, ఉద్యోగాలకు కూడ ఎగబాకుతూ వుండేను—అందుకేగా మీబోటివాళ్ళకు ఉద్యోగాలు లేంది.

ప్ర:- స్వతంత్రం స్త్రీ పురుషులకు సమానం.

వి:- ఆశయాలకే, ఆచరణలోనే లోభం గాని—స్టేజీ మీద ఎక్కితే నేనూ కోస్తా కోతలు.

ప్ర:- ఒక ఖాళీకి వేలకొద్దీ అప్లికేషన్సు, అంతకు ముందు డిక్లమండేషన్సు—ఎన్నాడి కిన్నాలో తేలక తికమకపడతారు.

వి:- తికమక ఎందుకు, చదానా కట్టాడో లేదో, చూసేందుకా. ఉద్యోగం లేక ఏడ్చుతుంటే పైన అదొకటి లోగడ "జిజియా" పన్ను మాదిరిగా.

ప్ర:- ఒక ప్రక్క Tax వేస్తున్నారన్న మీరే ఎరువులు ఉచితంగా యిస్తారా అనటంలో అర్థంలేదు. ప్రజల వద్ద పన్నులు వసూలు చేసేది ప్రజల అవసరాలకే ననే చిన్న విషయాన్ని ఆలోచిస్తే, మనకే తెలుస్తుం దిగా. ధనికులు పెట్టుబడులుపెట్టి పరిశ్రమలు ప్రోత్సహిస్తూ బీదవాడు ఉద్యోగాలు చేస్తూవుంటే అన్ని విధాల దేశం బాగుంటుందనే సూక్ష్మ రహ స్యాన్ని ఎవ్వరూ ఆలోచించరు.

వి:- నువ్వు ఆలోచిస్తున్నావు చాలదు.... పెద్ద ఉద్యోగము చేస్తే, పలానా వాళ్ల అబ్బాయని గౌరవముంటుందను కున్నాను.

ప్ర:- స్వార్థం మనలో జీర్ణించుకొని పోతే అలాగే పగటి కలలు కంటాం.

వి:- స్వార్థం లేని వాడెవ్వడోయ్ ఈ రోజుల్లో కాళ్ల అరిగేలా తిరిగే అతనిది స్వార్థం కాదు.

ప్ర:- అందు అతని స్వార్థమేముంది.

వి:- మరెందుకు తిరగటం.

ప్ర:- సుఖ జీవితమనే సోపానారోహణకు ప్రణాళికల్ని చేయూతగా తీసుకొని మెట్లెక్కుతున్నాం. ప్రజా వేగాన్ని బట్టి, గమనం పూర్తవుతుంది. మెట్లెక్కిన ఫలితముగా ఇప్పుడు కష్టతరమైనా తర్వాత సుఖ మనుభవిస్తాము.

వి:- అదే వ్యక్తిగత స్వార్థం.

ప్ర:- ఏది నాన్న స్వార్థం ? నూతన పద్ధతుల ద్వారా అధికాహారోత్పత్తి తోడ్పడం, స్వార్థమా ? తక్కువ వడ్డీలతో ఎక్కువ వాయిదాలపై అప్పు లివ్వటం స్వార్థమా ? కుటీర పరిశ్రమలు ప్రోత్స హించి నిరుద్యోగాన్ని రూపుమాపటం స్వార్థమా? వెట రినరీ మెటర్నిటీ సెంటర్సు ద్వారా పశువుల, ప్రజలకు వ్యాధుల బారినుండి కాపాడటం స్వార్థమా ? వయో జన విద్యా శాలల ద్వారా ప్రజలను జ్ఞానవంతు లుగా చేయుటం స్వార్థమా ? హుండీల ద్వారా డబ్బు పొదుపు చేయించటం స్వార్థమా ? ప్రతి గ్రామానికి సహదార్లు, రోడ్లు వేయటం స్వార్థమా? సర్వకాల సర్వావస్థలయందు మనలో మిత్రునివలె మెలగటం స్వార్థమా ఏది నాన్న యిందులో వాళ్ల స్వార్థాలు.

వి:- అయిందా నీ ఉపన్యాసం.

ప్ర:- ప్రజలందరిని ఒకే త్రాటిపై నడిపించి శ్రమదానం చేయ సమకట్టి—గ్రామసీమను దివ్యసీమగా మార్చా లనే అతని సంకల్పం : నాన్న, నీ కళ్ళకు కట్టి నట్లుందే ఆకాలపకు పడిన అభూతం పూడ్చిందెవరు.

వి:- ప్రజలేపూడ్చారుగా.

ప్ర:- అతను కోరేది ఆ ప్రజలకలయకేగా. ఆ ప్రజల్నే తనమాట వినమని కోరుతున్నాడు. ఎవరికి వారే యమునా తీరే అన్నట్లు కలసిరాక తటస్థంగాయుంటే గ్రామాల్లో మార్పు ఎలా వస్తుంది. ప్రతి ఒక్కనికి అందు భాగముందని తెలుసుకొన్నప్పుడేగా.

వి:- అదంతా మన పనేగా అతను తిరగటం. దేనికి.

ప్ర:- ప్రణాళికల యుద్దేశ్యం అదే–కాళ్లు అరిగేలా తిరిగ వలసి వచ్చేది పూర్వము–ఇప్పుడో ప్రభుత్వ ప్రతి నిధులు ప్రజలవద్దకు వచ్చి అవసరాలు తెలుసు కుంటూ ''తలలో నాల్క''వలె మెలుగుతారు. అనధి కారులు, అధికారులు సమైక్యంగా మెలగి అవినీతిని రూపు మాపాలి. వ్యక్తి లాభంతో. కూడిన సంఘ లాభాలకు కృషిసల్పాలి. ప్రభుత్వానికి మనకు మధ్య ఈ సారధి. వారధిలా వ్యవహరిస్తాడు.

వి:- తిరగడం వాళ్లవంతు–సహకరించటం మనవంతు అంతేనా.

ప్ర:-అవును ప్రణాళికలే ప్రజలు–ప్రజలే ప్రణాళికలు మన గృహాలు ఆనందంతో నిండాలి.

వి:- అదెలా సమకూర్చటం–తెచ్చిపెట్టుకుంటే వచ్చేది కాదే.

ప్ర:- గృహాల్లో స్త్రీ పురుష భేదాలు, వివిధ భేదాలు విస్మరించి ఒకరిపై మరొకరికి సంపూర్ణ విశ్వాసం కలిగి, స్నేహ భావంతో వర్ధిల్లాలి కష్ట సుఖాలను పంచుకొని, సహకరించుకోటానికి ఉద్యుక్తులై యుండాలి. మనం జాగ్రుతులం కావాలి.

వి:- ఎంతో కాలం నుంచీ పాతుకుపోయిన అలవాట్లు నమ్మకాలు ఇంతలో మార్పు రావటం అసాధ్యం.

ప్ర:- పాలు పొయ్యిమీద పెట్టిన వెంటనే పొంగుతాయా నాన్నా! అసాధ్యమని నిస్పృహ జెందితే ఎన్ని యుగాలు గడచినా అంధకారంలోనే అలమటిస్తాం.

వి:- (ఆలోచిస్తూ) నిజమే–బూజుపట్టిన పద్ధతులు నమ్మ కాలు క్రమేణా పోతున్నాయ్. పేకాడే క్లబ్బులు కూడ 'యూత్' క్లబ్‌లుగా మారుతున్నాయి. ఏదో అనాలని అంటమే గాని ఉత్పత్తి ఎక్కువైందీ.... ప్రాజెక్ట్సు అనేకము నిర్మించబడినాయ్. ప్రయోజనం లేకుంటే ప్రణాళికల్ని అందరూ ఎందుకు పూజిస్తారు. ....సమితుల ద్వారా సర్వహక్కులు ప్రజల చేతిలో పెడితే ప్రభుత్వం అంటే ఎందుకింకా భయం. ఉన్న డబ్బుతో సర్టిఫికెట్స్ కొంటే Tax తప్పుతుంది. అటు ప్రభుత్వానికి సహకరించినట్లు అవుతుంది.... అభివృద్ధి నిరోధకునిగా తయారయే దానికంటే ప్రణా ళికా ద్రోహ దానికి దారితీయటమే ధర్మంగా తోస్తోంది. లాభంలేదనితిరస్కరించేదానికంటె,ఆచరణయుక్తము (పత్రికావైపు తిరిగి) కాలం తీరిన నాటోటి వారితో ఏమిటి గాని, నవనిర్మాణానికి నవయువకులంతా ముందంజ వేసి తీరాలి. నీవు చెప్పినట్లే నడుస్తానులే, నేనే ఓడిపోయాను.

ప్ర:- (నవ్వుతూ) ఇందులో ఓడిపోవట మేముంది. భార తీయులలో ఒకరు గెలిచారు, మరొకరు ఓడారు అనే చీకటి తెరలు తీసివేసి, మనవలె ప్రణాళికలను సృష్టించుకొని సుఖప్రదంగాను, ఆర్థికంగాను, పుష్టి వంతంగాను ఇతర దేశాలతో పోటీపడి, జయాన్ని పొంద కంకణము కట్టుకొని దీక్షతో కృషిచెయ్యాలి.

వి:- నిజమే—రష్యా, అమెరికాలు ఆహారపదార్థాల ఎగు మతికి చూస్తూయుంటే మనం దిగాలుపడి దిగుమతికి చూస్తున్నాం—వారు చంద్రమండల యాత్రా సన్నా హాల్లో యుంటే—మనం ఆరోగ్య వారాలు జరిపే సన్నాహాల్లో యున్నాం.— వారు చాల ముందుకు పోయారు.

ప్ర:- నాన్నా! నీ వలె ప్రతి భారతీయుడు పశ్చాత్తాపపడి ప్రణాళికల ద్వారా ప్రగతికి దారితీస్తే, మనము ఆ విషయాన్ని తప్పక సాధిస్తాము. ఈ రెండు ప్రణాళి కలు వెన్నుతట్టి అదే బోధిస్తున్నాయ్.

వి:- సారధి దగ్గరకెళ్ళి అభివృద్ధి మార్గాలు తెలుసుకో ఆ విధంగా మార్పు తెచ్చుకుందాం— నే రావటానికి ముఖం చెల్లదు.

ప్ర:- ఇప్పటికైనా ప్రణాళికారోహణ భాగస్వాముల మైనందుకు సంతోషంగా అతన్ని సమీపిద్దాం.

వి:- సరే.

4–వ భాగము

(సారధి ఏదో వ్రాస్తూయుంటాడు వినాయకరావు ప్రకాశ్‌లు రావటంతో లేచి)

సా:- కూర్చోండి.

వి:- వయస్సు తక్కువైనా నీ సహనం, సహకారం, సమభావం, విధేయత, విజ్ఞానాలకు ఆశ్చర్యపడు

చున్నాను. నీ శిక్షణ గరిపిన చింతామణి గారు నిజంగా భారత దేశానికి మణి లాంటి వారనుటలో అతిశయోక్తి లేదు.

**సా:-** అవి నా ధర్మాలు.

**వి:-** మా ధర్మం మేము తెలుసుకొన్నప్పుడేగా, ధన మదాంధతతో నిన్ను అవమానించాను అనేకసార్లు. నా అజ్ఞానాన్ని తెలుసుకొన్నాను.

**సా:-** వినాయకరావు గారూ! ఒక వ్యక్తి మరొక వ్యక్తి పట్ల ఎలా ప్రవర్తించాలనే చైతన్య పూరితమైన దృక్పథం ఏర్పరచుకోవాలి — సంతృప్తి గాను, సక్రమం గాను నెరవేర్చిననాడు, మనకు కావలసిన గృహాలు, వస్త్రాలు, ఆహారం సమకూర్చుకొన గల్గుతాం.

**ప్ర:-** ప్రణాళికలంటే ఏమిటో నీ పాత్ర అందులో ఎంత పవిత్రమైన విలువైందో నీ స్నేహానికి ముందు నేనూ తెలుసుకోలేక పోయాను. తెలుసుకొని నాన్నకు వచ్చి చెప్పాను. హాస్పటల్సు డాక్టర్లు, కోర్టుల్లో యుండే ప్లీడర్లు, కోటికి పడగలెత్తిన కోటీశ్వర్లు ఎందరున్నారో యింకా

**వి:-** ప్రణాళికలు తప్ప అభివృద్ధికి మార్గం లేదని వారు తెలుసుకొని తీర్తారు.

**సా:-** ప్రస్తుతం ఔన్నత్యంతో తులతూగుతున్న దేశాలకు మొదట కారణం— లక్ష్యాలు యుద్దేశ్యాలు, ఫలప్రదం కావటానికి ఆధారం-ఈ ప్రణాళికలే మూలం.

**వి:-** అందరూ మన వలె ముందుకొస్తారు.

(కాంతయ్య ప్రవేశిస్తూ)

**కాం:-** ఓ! హో! వినాయకరావు గారా! ఎన్నాళ్ళయిందండి తమరు ముందుకొచ్చి.

**వి:-** నీవే ముందడుగు వేశావు కాంతయ్యా.

**కాం:-** ఆ! లావుగా యున్న వారెప్పుడూ వెనకడుగేగా (అందరూ నవ్వుతారు) మీ బాకీ తీరిందిగా బాబు.

**ప్ర:-** నీ బాకీ తీరింది. ప్రతి వ్యక్తికి సంఘములో యుండే బాకీ తీర్చటానికి మేము వచ్చాం.

**కాం:-** (సారథితో) నా గిత్తను నాల్గు వేలకు బేరం యిచ్చాను. బ్యాంకులో అప్పతీర్చేస్తాను, ముఖ్యంగా దానికా ధర రావటానికి మీరే కారణం.

**సా:-** అందులో నా గొప్ప ఏమీ లేదు—కీలక పశుగణాభివృద్ధి కేంద్రం వారిది. వారు చెప్పినట్లు నడచి, ఫలితం అనుభవించే నీదీను.

(వెంకటరత్నం ప్రవేశం)

**వెం:-** పంటల పోటీలో బహుమానం వచ్చినందుకు మీ కందరికి టీ పార్టీ యిస్తున్నాను, మీరంతా తప్పక రావాలి.

**వి:-** టీ పార్టీ కేమిటిలే వెంకటరత్నం, ఇకనుండి మన మంతా ఒకే పార్టీ

**ప్ర:-** టీ పార్టీలలో పడి మన పార్టు మర్చిపోరుగదా!

**సా:-** నూతన పద్ధతులు అవలంబించి, మీకు మాకు గౌరవాన్ని దేశానికి అధిక ఉత్పత్తిని సాధించారు.

**వి:-** దానికి సారథ్యం వహించి నీపేరు సార్థకం జేసుకొన్నావు.

**ప్ర:-** ప్రణాళికా విధాన్ని ప్రజలందరూ ముందుకులాగుతూ కూర్పుతోకూడిన మార్పులు తెచ్చుకున్నాం. ఆ రథానికి సారధి పాటమా అదృష్టము.

**కాం:-** అప్పులనే అంధకారంలోబడి తీరు తెలియక అలమటిస్తున్న మాకు నూతన బాటలు చూపించారు.

**వెం:-** తక్కువ పెట్టుబడితో ఎక్కువ లాభాలు పొందుతూ మా కాళ్ళ మీద మేం నిలబడే శక్తి సంపాదించుకొన్నాం నీ పుణ్యమా అంటూ.

**సా:-** ఇవన్నీ నా విధులు. ప్రణాళికలంటే ప్రజల కొరకే ననీ, ప్రజల ఐక్యత మీదా ఆధారపడియుంటుందని చూపించాలనే నా సంకల్పము, విధి సిద్ధించినది. గ్రామీణులంతా సహకరిస్తున్నందుకు సంతోషిస్తున్నాను. భారతదేశపు రూపురేఖలు దిద్ది, ఆర్థిక వ్యవస్థను ప్రతిష్టింపజేసి, అజ్ఞానాన్ని అనారోగ్యాన్ని అసమానత్వాన్ని తొలగించే ఈ ప్రణాళికలపైన, పథకాలపైన ఆసక్తి జూపుతూ భారతదేశాన్ని ప్రపంచంలో జ్యోతిలా చెయ్యాలని భారతీయులందరూ మనస్సునందు ముద్రించుకొని భద్రపర్చుకొంటే ఈ ప్రణాళికలు వర్ధిల్లుతాయ్.

ప్ర:- చదువుశాటి ప్రిన్సిపల్స్ ఊహించిన ఐడియల్స్ డిస్మిస్సైె వ్యర్థ జీవితంతో వ్యక్తిత్వాన్ని చంపుకొని అణగారిన ఆశయాలతో అర్ధాంగి కేకలకు విసుకు జెందే N. B. O. S లారా— దరిద్రాన్ని దలచు కుంటూ దారాపుత్రులతో పగలు రేయి పొలాల్లో పడి యుండి, పాటుపడి పండించి. రిక్త హస్తాలతో కుక్కి మంచాన కునికిపాట్లు పడే రైతు సోదరు లారా— ఊచుబోక క్లబ్ కెళ్ళి డబ్బుతో సీక్వెన్స్ ఆడే శ్రీమంతులారా— డబ్బు లేక పిల్ల పెళ్ళిగాక హృదయాలు బరువెక్కి కుమిలి, కుమిలి కృశించే అభాగ్యులారా !- కళాశాలల్లో జేరి చదువుకు సున్న జుట్టి సీమంతులకోసం పగటి కలలుగనే నవయువకు లారా- ఇద్దరు కట్టాలంటూ డొప్పాలు గొట్టి టర్కీ టవల్స్‌కు కొట్టు కొట్టుకేగే దేశ భక్తులారా—ఓటు వేటతోడ ఓటర్లను మభ్యపెట్టి, ఒడుదుడుకు మాట లతో ఒట్టులేచి. సీటులెక్కి చెంతకొస్తే చీదరించే మహా నాయకులారా! ప్రణాళికలంటూ యెలుగెత్తి, గొంతెత్తి చాటవస్తే పరుగెత్తే పామరులారా- మీలో కుళ్లంతే కడిగివేసి చీకటి మరుగుబడ్డ ప్రజలను వెతకిపట్టి అభివృద్ధికి దోహద మివ్వ తలపెట్టి ప్రభుత్వం ప్లానేసింది. అవే ఈ పంచవర్ష ప్రణాళికలు. ప్రజా శక్తిలోని నవశక్తి కంతే వేరే శక్తి లేదని ప్రతి వ్యక్తి భక్తితో భజించితే. రక్తి కట్టి ముక్తి పొందుతారని నమ్మంతి. అప్పుడే ఈ మానవాళి యొక్క బాధావళి పోయి శోభావళి వస్తుంది. అదే మనకు నిజమైన దీపావళి.



ఒక ఆదర్శం గొప్పదానికి అవధులు లేకపోవడం లోనే ఉంది. కాని మతాదర్శాలు, వాటి స్వభావాన్ని బట్టి, అసంపూర్ణులైన మానవులచే సాధింపబడకపోయినా, నిస్సీమమైన వాటి స్వభావం వల్ల అవి మనకు దూరమవుతున్నట్టు కనబడినా, వాటిని మనం సమీపించిన కొలదీ అవి మనకు, మన చేతులు కాళ్ల కంటే కూడా దగ్గర అవుతాయి. ఎందువల్లనంటే మన ఉనికి కంటె వాటి ఉనికే మన కెక్కువ నిశ్చయంగా గోచరిస్తుంది. ఎవరికైనా తమ ఆదర్శాలపట్ల గల యీ విశ్వాసమే జీవితం, వాస్తవానికి అదే మానవుని సర్వస్వమూను

— మహాత్మాగాంధి

* * *

ఒకే తప్పును రెండుసార్లు చేయడం సిగ్గుచేటు

— గ్రీకు సామెత

జానపద గేయం:

# సదువు కావాలోయ్!

( గ్రామీణుల కొఱకు వయోజన విద్యా ప్రచార గీతం )

చెఱుకుమిల్లి భాస్కరరావు **బి.ఎ.బి.ఇడి.**

మావ:- సదువెందుకే లచ్చి- సదువెందుకే-
సంసారముండంగ- సాలదా లచ్చీ- ॥సదువెందుకే॥

లచ్చి:- సదువెందుకా మావ- సదువెందుకా-
సదువంటు లేకుంటె- పరువు పోతాదోయి- ॥సదువెందుకా॥

**మావ:-** పగలు రేతిరిలేక- పాటు పడతామే-
బతుకంత బలిచేసి- బాధ పడతామే-
సావడానికి కూడ- సమయమే లేకుంటె-
సదువు వెందుకు మనకు-వదలవే లచ్చీ- ॥సదువెందుకే॥

లచ్చి:- పనిచేసి బలిచేసి- పాటు పడతామోయి-
ఫలితమేదో మనము- తెలుసుకోలేమోయి-
పనిలోని పసతోటి- మనకింత సదువుంటె-
మునుపు లాగిక మనము- మోసపోమో మావ- ॥సదువెందుకా॥

మావ:- ప్రతిఏడు మన వయసు- పెరుగు తున్నాదే-
బతుకనే బాటలో- గతుకులున్నాయే-
ఎదురు తెన్నులులేని- **ఏటి** కెదురీతలో-
సదువు సలే మనకు- సాగవే లచ్చీ- ॥సదువెందుకే॥

లచ్మి:— మనసంటు నీకుంటె— మార్గమున్నాదోయి—
మన కోసమే సదువు— మాపులున్నాదోయి—
మాపిటికి బడిలోన— దీప మెదతారోయి—
మనసుంపిరము జేరి - మంచిగా మారాలి— ॥సదువెందుకా॥

మాంవ:- సిన్న నాటనె సదువు— సున్న చుట్టించామె—
ఇన్ని యేళ్లూ మనము— మిన్నకున్నామే—
సదువుకోసం నేడు— బడిలోకి పోబోతె—
సదుం చూశారంటె- పక్కుమంటారే— ॥సదువెందుకే॥

లచ్మి:— ముదుసలయినా కూడ- సదువుకోవాలోయ్—
అదను మించినదంటు— అలమటించాలోయ్—
విద్దెకోసం మనం— వేగిరించాలోయ్—
ఇద్దరం బుద్ధిగా— విద్దె నేర్వాలోయ్—
సదువెందుకామాంవ— సదువెందుకా—
సదువందుకే మనం— బతికేందుకే—

మాంవ:— సదువందుకా— మనం బతికేందుకా—
పరువు నిలిచేందుకా— కరువు తీరేందుకా! ——

———:0:———

వ్యక్తిగా మానవుడు తన జీవితాన్ని పటిష్ఠం చేసుకోవాలి. వర్తమానాన్ని భూత భవితవ్యాలతో సమన్వయం చేసుకోవాలి. వర్తమానంలో జీవిస్తూ శాశ్వత శక్తులను గుర్తించాలి. జీవిత నావను ఆత్మశక్తితో బంధించాలి. కాని మనని మనం అన్ని రకాల ఒత్తిడులకు గురిచేసుకొని, అన్ని ప్రభావాలకులోనై వాటిని మన జీవిత విధానానికనుగుణంగా మార్చుకొని హెచ్చు తగ్గులు, ఒడిదుడుకులు లేని ప్రపంచనిర్మాణానికి కృషి చేయాలి.

— ఎస్. రాధాకృష్ణన్.

# కవి ప్రతిభ

కె. వెంకటసుబ్బారావు

భోజరాజుచే పరిపాలింప బడుచున్న ధారా నగరానికి సమీపంలో ఒక కుగ్రామం వుంది ఆ గ్రామంలో ఒక పేద బ్రాహ్మణుడున్నాడు అతని పేద తనానికి తోడు గంపెడు మంది పిల్లలు. సంసారం గడవటం కష్టమైంది. పాపం! ఉన్నట్టుండి అతనికి ఒక ఆలోచన వచ్చింది. భోజరాజు ఆస్థానానికి వెళ్ళితే ఆ మహారాజు ఏదైనా సహాయం చేయక పోతాడా అనుకున్నాడు- కాని తాను కవికాడు; కవులనే సన్మానిస్తాడాయె మహారాజు! అతనికి ఏమీ తోచక వీధిలో ఒక చోట కూర్చున్నాడు. ఆ సమయంలో కాళిదాసు అక్కడికి వచ్చి దీనవదనుడైన బ్రాహ్మణుని జూచి అతని విచారానికి కారణం అడిగాడు. ఆ పేద బ్రాహ్మణుడు తన సంగతంతా చెప్పుకున్నాడు. కాళిదాసు హృదయంకరిగి "ఓ బ్రాహ్మణుడా! రేపు నీకు రాజదర్శనం చేయిస్తాను. ఏమైన పండ్లు తీసికొని ఆస్థానానికి రావలసినది" అన్నాడు. కాని ఆ బ్రాహ్మణుడు తన దగ్గరనున్న డబ్బు నిన్ననే ఖర్చయి పోయింది అన్నాడు దీన వదనంతో. అంత కాళిదాసు తానే ఒక రూపాయినిచ్చి, చేయ వలసిన తతంగమంతా చెప్పి, వెళ్ళిపోయాడు

ఆ బ్రాహ్మణుడు ఆ రాత్రి ఎలాగో గడిపి మర్నాడు బజారుకి వెళ్ళాడు. ఒక కొట్టులో చెరకుగడలు ఉండటం చూసి మూడు చెరకు గడలను కొనుక్కొని పిమ్మట వానిని ముక్కలుగా ఖండించి మూట గట్టుకొన్నాడు. ఆ మూట తీసికొని రాజ ద్వారం వద్ద నిలుచున్నాడు. కాళిదాసు అతనిని చూచి లోపలికి వెళ్లాడు.

ఆ బ్రాహ్మణుడు ఎదురుగుండా ఒక బ్రాహ్మణుని అరుగు ఉంటే అక్కడ కూర్చున్నాడు. రాత్రి యంతయు నిద్ర లేమిచే కన్నులు మూత పడ్డాయి. కొంత సేపటికి ఒక బాటసారి ఆ దారిన వస్తూ చెరకు గడల మూటను చూచి, నోరూరి, సంగ్రహింప దలచి, వెంటనే, చెరకు గడల మూటను లాగి వైచి తాను వండు కొనగా మిగిలిపోయిన కొరకంచుల్ని మూటగట్టి, అది విప్రుని తలక్రింద నుంచి, ఉడాయించాడు.

బ్రాహ్మణునికి మెలకువ వచ్చింది ఇంతలో ఆస్థానము లోనికి పిలుపు వచ్చింది. బ్రాహ్మణుడు లోనికి వెళ్ళినాడు. వెంటనే భోజరాజునకు తాను తెచ్చిన మూటను ఇచ్చినాడు. ఇప్పచూస్తే ఏముంది కొరకంచులు! అందరు నివ్వెర పోయారు! భోజరాజుకు పెద్ద అవమానమైంది! విప్రుడు తాను చెరుకు గడలను తెస్తే, కొరకంచు లుండటం చూచి ప్రాన్పడి పోయాడు!

కాళిదాసు ఇది గ్రహించాడు. ఏదైన పొరపాటు జరిగి యుండ వచ్చుననుకొన్నాడు తానీ సమయంలో సహరించ కపోతే బ్రాహ్మణుని గతి నిర్గతె నముకొన్నాడు! కాళిదాసు రాజువైపు చూసి "ఏమిటలా నివ్వెర పోతున్నారు? కొరకంచులు అమంగళ ప్రదములనేనా మీ అభిప్రాయము? ఈకవి వాటిని తెచ్చుటలో - గూఢార్థాన్ని వివరిస్తాను. వినండి" అని ఈ శ్లోకం చెప్పాడు.

శ్లో॥ దగ్ధం ఖాండవ మర్జునే నచవృథా కల్పద్రుమైర్భూషితం.
దగ్ధావాయుసుతేన హేమరచితాలంకా పృథాస్వర్ణభూః.
దగ్ధస్సర్వసుఖాస్పదశ్చ మదనోహాహా వృథా శంభునా
దారిద్ర్యం ఘనతాపదం భువినృణాం కేనాపి నోదహ్యతే.

తా॥ అనేక ఔషధాలతో కూడుకొని ఉన్న ఖాండవ వనాన్ని నిష్కారణంగా అర్జునుడు కాల్చాడు. లంకను హనుమంతుడు దహించాడు. సౌఖ్య ప్రదాయుడగు మన్మధుణ్ణి శివుడు దహించాడు. కాని జనపీడితమైన దారిద్ర్యాన్ని ఎవరూ దహించలేక పోయారు. ఈ కొరకంచులతో దానిని దహించుము "అని ఇచ్చాడు అని కాళిదాసు సమర్థించి చెప్పాడు.

మహారాజు సతోషించి ఆ బ్రాహ్మణుని సత్కరించాడు. చూశారా! కాళిదాసు ప్రతిభ! సమయ స్ఫూర్తి!

---

# స్థానిక సంస్థల నూతన పాత్ర

స్థానిక సంస్థల పనుల పరిధి విశాలమైనది. సమాజానికి సంబంధించిన పెక్కు పౌర, ఆర్థిక కార్యాకలాపాలు ఆ పరిధిలోనికి వస్తవి. కాని, వాస్తవం. స్థానిక సంస్థలు తమ తమ పనులను విస్తృతం చేయలేదనే చెప్పాలి. ఇందు వల్ల మామూలు పనుల స్థాయిని నిలబెట్టటమే కష్టంకాగా అభివృద్ధి కార్యకలాపాల అమలు అసలే పొసగదు.

స్థానిక సంస్థలు ప్రజలకు అవసరపు పౌర సౌకర్యాలను కల్పించాలంటే వాటి ఆర్థిక వనరులు పెంపొందాలి. ఇందు నిమిత్తం వాటికి అభివృద్ధి పథకాల అమలుకై దీర్ఘకాలిక ఋణాల ద్వారా తోడ్పడటం అవసరమని భావించబడింది.

ఆ ప్రకారం సాధారణంగా ప్రతిఫలం యిచ్చే రకం అభివృద్ధి పథకాల అమలుకై మునిసిపాలిటీలకు, పంచాయతీలకు అప్పులు యివ్వటానికై రాష్ట్ర ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో రూ. 41.86 లక్షలు కేటాయించబడినవి. టౌన్ ప్లానింగ్ పథకాల అమలుకై కూడా మునిసిపాలిటీలకు అప్పులు యివ్వ బడినవి. 1956–60 మధ్య దిగువ వాటి నిర్మాణం లేక అభివృద్ధికై రూ. 33.[illegible]5 లక్షలు ఖర్చు చేయబడినవి:-31 మార్కెట్లు, 6 బావులు, చెరువులు, 11 బండి, బస్సు స్టాండులు, 6 టౌన్ ప్లానింగ్ పథకాలు, 6 ప్రసూతి శిశు సంక్షేమ కేంద్రాలు, 7 కార్యాలయ భవనాలు, 2 మరుగు దొడ్లు, 5 కసాయి శాలలు, 13 రోడ్లు, 1 పార్కు ఆట స్థలం. 1960-61 కి (ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఆఖరి యేడాది) దిగువ వాటి నిర్మాణం లేక అభివృద్ధికై రూ 8.81 లక్షలు కేటాయించబడినవి. 8 మార్కెట్లు, 5 బావులు చెరువులు. ఒక ప్రసూతి, శిశు సంక్షేమ కేంద్రం, ఒక స్టేడియం, ఒక కార్యాలయ భవనం. ఒక కసాయిశాల, 3 రోడ్లు, ఒక్క పార్కు, ఆట స్థలం, ఒక యూత దొరువు.

తృతీయ పంచవర్ష ప్రణాళికలో యిదే పద్ధతి అవలంబించబడింది. సొమ్ము మాత్రం యింతకంటె యెక్కువ కేటాయించ బడింది మునిసిపాలిటీలకు. కేవలం మార్కెట్లు ప్రసూతి శిశు సంక్షేమ కేంద్రాలు, కార్యాలయ భవనాలు, రోడ్లు, మున్నగు పథకాల అమలుకై అప్పులు యిచ్చేందుకు రూ. 150 లక్షలు. టౌన్ ప్లానింగ్ పథకాల నిమిత్తం రూ. 25 లక్షలు తాత్కాలికంగా కేటాయించ బడినవి. ఇంకా లక్ష్యాలు నిర్ణయించబడలేదు. మునిసిపాలిటీల నుంచి వివరాలు తెప్పించి వాటికి తప్పనిసరి అయిన అవసరాల ననుసరించి ఖచ్చితంగా లక్ష్యాలు నిర్ణయించ బడతాయి. సాధారణంగా ప్రతిఫలం యిచ్చే రకం పథకాలకు అధిక ప్రాధాన్యత యివ్వబడుతుంది.

## పంచాయతీలు

1958-59లో. పంచాయతీ పరిపాలనకు సంబంధించిన ఫీల్డు, అజమాయిషీ సిబ్బంది పరిపాలనా వ్యవస్థ పునర్నిర్మించ బడింది. దీనితో జిల్లా స్థాయిలో ఒక జిల్లా పంచాయతీ అధికారి, రెవిన్యూ డివిజన్ స్థాయిలో డివిజనల్ పంచాయతీ అధికారి, ప్రతి బ్లాకులోను పంచాయతీలకు విస్తరణాధికారి, బ్లాకు క్రిందలేని తాలూకా భాగానికి ఒక డిప్యూటీ పంచాయతీ అధికారి ఏర్పడ్డారు. ఇందు వల్ల యీ వ్యవస్థకు పంచాయతీలతో సన్నిహితత్వమేర్పడి వాటికి తగిన సహాయం చేసే అవకాశం కలిగింది. ఫీల్డుసిబ్బందికి, అజమాయిషీ సిబ్బందికి పంచాయతీ పరిపాలనా విషయాలలో అవసరమైన శిక్షణకు కూడా ఏర్పాటు చేయ బడినది. జిల్లా పంచాయతీ అధికార్లు, పెద్ద హోదాలో ఉన్న అధికార్లు (ఆంధ్రలో స్థానిక పరిపాలన ప్రాంతీయ ఇనస్పె

క్టర్లు, తెలంగాణాలో ఇనస్పెక్టింగ్ ఆఫీసర్లు), అసిస్టెంటు ఇంజనీర్లు (పంచాయతీ పనులు) శీఘ్ర ప్రయాణాలు చేసి పంచాయతీ పరిపాలనకు సంబధించిన పనులను అజమాయిషీ చేసేందుకు వీలుగా వారికి జీపులు యివ్వబడినవి.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో యీ పథకం క్రింద రూ. 24 63 లక్షలు కేటాయించ బడినవి. ఇందులో 1956-60 మధ్య రూ. 12,74 లక్షలు ఖర్చు చేయబడినవి. 1960-61 లో రూ. 11.89 లక్షలు ఖర్చు పెట్ట బడగలవు.

తృతీయ పంచవర్ష ప్రణాళికలో యీ పథకం క్రింద తాత్కాలికంగా కోటి రూపాయలు కేటాయించ బడినవి. ఇందులో పది లక్షలతో సబార్డినేటు ఆఫీసర్ల కార్యాలయాలలో అదనపు సిబ్బందిని నియమించి తద్వారా వాటిని బలపరచటం జరుగుతుంది. మిగిలిన 90 లక్షలు అభివృద్ధి పథకాల అమలుకై పంచాయతీలకు అప్పులు ఇవ్వబడతాయి.

## పంచాయతీల కార్యకలాపాలు

గ్రామస్థాయిలోగల వివిధ సంస్థల ద్వారా సమాజం ఏకీకృత అభివృద్ధికి జరిగే ప్రయత్నమే సమాజాభివృద్ధి కార్యక్రమం. ఇందులో ఎక్కువ ప్రజాదరం పొందిన సంస్థ పంచాయతీ గ్రామస్థాయిలో వివిధ సంస్థలున్నప్పటికీ, అవి, ప్రజాస్వామ్య పద్ధతిలో చట్ట రీత్యా యేర్పడిన గ్రామ పంచాయతీకి యీడురావు.

పంచాయతీలు, యింత వరకు, రోడ్లు నిర్మించి, రక్షిత నీటి సరఫరా, మురుగు పారుదల సౌకర్యాలు కల్పించి పాఠశాలలు వగైరా తెరచి ప్రజలకు సేవచేస్తున్నవే కాని గ్రామీణుల ఆర్థిక, సాంఘిక పరిస్థితులను పరిశీలించుట లేదు; తత్ఫలితంగా గ్రామస్థుడు విడిగా జీవిస్తూ మొత్తం సమాజ సంక్షేమానికేమి కావాలో తెలుసుకొన లేకపోయేవాడు.

ఇంతకు ముందుగల పంచాయతీల శాసనం వాటిపనులను "విధ్యుక్తం" "వైచక్ష్యణం" అని రెండు రకాలుగా విభజించినది.

### విధ్యుక్త ధర్మాలు

1. గ్రామంలోని పబ్లిక్ రోడ్లు (జాతీయ, రాష్ట్ర రహదారులుగా విభజించబడిన జిల్లాబోర్డు రోడ్లు తప్ప) అన్నిటి నిర్మాణం, మరమ్మతు, నిర్వహణ.

2. పబ్లిక్ రోడ్లు, పబ్లిక్ ప్రదేశాలలో దీపాలు పెట్టటం.

3. మురుగు కాల్వల నిర్మాణం, మురుగు తొలగింపు.

4. వీధులతుడుపు, పెంటకుప్పలు, అడవి మొక్కలు, ముళ్ళడొంకల తొలగింపు, పాడుపడిన బావులను, మురుగు గుంటలు, దొరువులు వగైరాలను పూడ్చడం. గ్రామ పారిశుద్ధ్య పరిస్థితుల అభివృద్ధికి కలసిన యితర కృషి.

5 పబ్లిక్ మరుగు దొడ్ల ఏర్పాటు, గ్రామంలోగల అన్ని రకాల మరుగు దొడ్లను శుభ్రం చేసే ఏర్పాటు, శ్మశాన వాటికల ఏర్పాటు, నిర్వహణ.

6. బావుల త్రవ్వకం, మరమ్మతు, దొరువులు లేక చెరువుల త్రవ్వకం, మరమ్మతు, నిర్వహణ. వాడకానికి నీటి సరఫరాకు, త్రాగేందుకు రక్షిత నీటి సరఫరాకు నీటి పనుల నిర్మాణం, నిర్వహణ.

7. అంటు వ్యాధులు లేక మలేరియా విషయంలో నిరోధ నివారణలకు కృషి.

### విచక్షణా విధులు

1. జిల్లా రోడ్లు లేక ప్రభుత్వంచే జాతీయ లేక రాష్ట్ర రహదారులుగా విభజించ బడిన రోడ్లు తప్ప గ్రామంలో మిగిలిన పబ్లిక్ రోడ్ల వార చెట్లను నాటి సంరక్షించుట.

2. జిల్లా మార్కెట్లుగా విభజించ బడని మార్కెట్ల ఏర్పాటు, నిర్వహణ.

3. జిల్లా సంతలు, ఉత్సవాలు కాని సంతలు, ఉత్సవాలకు అధ్వర్యం వహించటం.

4. బళ్ల స్టాండులు వగైరాలను, పబ్లిక్ పశువుల కొట్టాలను తెరచి, నిర్వహించటం.

5. పబ్లిక్ కసాయి శాలల ప్రారంభం, నిర్వహణ.

6. జిల్లా సత్రాలు కాని సత్రాల ప్రారంభం, నిర్వహణ.

7. గ్రామ స్థలాల విస్తరణ, భవననిర్మాణం క్రమ పద్ధతిలో జరిగేట్టు చూడటం.

8. జనన మరణాల రెజిస్ట్రేషన్.

9. వ్యవసాయాభివృద్ధి, వ్యావసాయిక ప్రదర్శనలకు జరపటం.

10. కుటీర పరిశ్రమల అభివృద్ధి.

11. ప్రాథమిక పాఠశాలల ప్రారంభం, నిర్వహణ.

12. పఠన మందిరాలు, జిల్లా గ్రంథాలయాలు కాని గ్రంథాలయాల ప్రారంభం, నిర్వహణ.

13. డిస్పెన్సరీల ప్రారంభం నిర్వహణ, గ్రామాల లోని మెడికల్ ప్రాక్టీషనర్లకి సబ్సిడీలు చెల్లింపు

14. వైర్‌లెస్ రిసీవింగ్ సెట్లు, ఆట స్థలాలు, స్పోర్ట్సు క్లబ్బులు, వ్యాయామ కేంద్రాల ఏర్పాటు, నిర్వహణ

15. ప్రసూతి, శిశు సంక్షేమ కేంద్రాల స్థాపన, నిర్వహణ.

16. పశు చికిత్సా సదుపాయాలు.

17. గ్రామస్థుల భద్రత, ఆరోగ్యం సుఖం లేక సౌకర్యాలకు దోహదం చేయగల యితర పనులు.

## నూతన పాత్ర

సమాజాభివృద్ధి కార్యక్రమం ప్రారంభంతో, పంచాయతీల పాత్ర నూతన రూపాన్ని ధరించింది. ఆ సమాజ క్షేమం, ప్రాంత క్షేమం సర్వతోముఖంగా అభివృద్ధి చెందటానికి అవి కృషి చేయవలసి ఉంది. పంచాయతీలు దిగువ అన్ని విషయాలలోను కాని అందులోయే ఒక్క విషయంలోనైనా కాని ప్రజలకు తగిన సౌకర్యం కలుగ జేయాలి. ఈ పనులను తమతమ ఆర్థిక వనరుల పరిధిలో చేస్తూ అవసరమైనప్పుడల్లా సాంకేతిక సలహా సహాయాలు, అప్పులు, సరఫరాలు వగైరా రూపంలో ప్రభుత్వ సహాయాన్ని పొంది కూడా జరపాలి:—

1. పారిశుద్ధ్యం, ప్రజారోగ్యం.
2. పబ్లిక్ పనులు
3. విద్య, సంస్కృతి.
4. సాంఘిక సంక్షేమం.
5. వ్యవసాయం.
6. గ్రామ పరిశ్రమలు.
7. పశుపోషణ, రక్షణ వగైరా.

ప్రజా స్వామ్య విజయసాధనకై గ్రామ పంచాయతీలు వాటికిపై అంతస్తు లోగల పంచాయతీ సమితులతోను, జిల్లా పరిషత్తుల తోనుకలుప బడినవి.

పంచాయత్ రాజ్ పథకం క్రింద, పంచాయతీల సభ్యుల పై కొన్ని బాధ్యతలు పడుతున్నవి. తమ అధికారాలను, తాము నిర్వహించ వలసిన బాధ్యతలను అర్థం చేసుకొని, గ్రామాలలో అభివృద్ధి కార్యక్రమాలను సంపూర్ణంగా, సమర్థంగా అమలు జరపటానికి తగిన శక్తిని వారికి సమకూర్చేందుకై శిబిరం—రకం శిక్షణా పథకం ఒకటి తయారు చేయబడి అమలు జరుప బడుతున్నది.



ఆరంభ రహితుఁ డొందునె
యారయ సంపదలు హీనుఁడయ్యును బురుషుం
డారంభ శీలుఁడయి యక్క
తారంభుల నొర్చు నెంత యధికులనయినన్

— భార. సభా.

# ప్రశ్నోత్తరావళి

110వ ప్రశ్న: శ్రీ ఎ. నరిసింలు, నిజామాబాదు.

నిజామాబాదు జిల్లాలోని రామడుగు ప్రాజెక్టు పని యెప్పుడు ప్రారంభమవుతుందో, తెలియ జేస్తారా?

జః- రామడుగు ప్రాజెక్టు అంచనా కేంద్ర జల, విద్యుచ్ఛక్తి కమిషన్ పరిశీలనలో ఉన్నది. ఈ ప్రాజెక్టుకి పరిపాలనా సంబంధమైన మంజూరీ లభించిన పిమ్మట పని చేపట్టబడుతుంది.

111వ ప్రశ్న: శ్రీ కె. రామలింగం, మీర్‌ఖాన్‌పేట హైదరాబాదు జిల్లా.

ఆంధ్ర ప్రదేశ్ నుంచి నియమితులైన ఆరుగురు గవర్నర్లు ఎవరు, వారు యే యే రాష్ట్రాలలో నియమితులయినారు?

జః- 1. శ్రీ వి.వి. గిరి (ఉత్తరప్రదేశ్), 2. శ్రీ బి. రామకృష్ణారావు (కేరళ), 3. కుమారి పద్మజా నాయుడు (పశ్చిమ బెంగాలు) 4. డా. జకీర్ హుస్సేన్ (బీహారు), 5. జనరల్ శ్రీ నగేష్ (అస్సాం), 6. శ్రీ మెహిదీ నవాజ్‌జంగ్ (గుజరాత్).

112వ ప్రశ్న: శ్రీ సుసవరం హరిశ్చంద్ర రెడ్డి, చుండూరు గ్రామం; అలంపురం తాలూకా

శ్రీశైలం ప్రాజెక్టు అంచనా ఖర్చు ఎంత? ఈ పూర్తి కావడానికి ఎంత కాలం పడుతుంది? ఆనకట్ట ఎత్తు యెంత వుంటుంది? ఎంత నీరు నిలవచేయబడుతుంది? ఎంత విద్యుచ్ఛక్తి వుత్పత్తి కాగలదు?

జః- ఈ ప్రాజెక్టుపై మొత్తం రూ. 4,977 లక్షలు ఖర్చు కాగలదని అంచనా.

ఇప్పుడు తలపెట్టిన కార్యక్రమం ప్రకారం, శ్రీశైలం విద్యుదుత్పత్తి కేంద్రం లోని 3 యూనిట్లలోను రెండు 1966—67లో పని ప్రారంభించగలవని భావించబడుతున్నది. మూడోది ఆ తరువాత సంవత్సరములో పని ప్రారంభిస్తుంది. శ్రీశైలం వద్ద తృతీయ పంచవర్ష ప్రణాళికలో స్థాపితమైన విద్యుచ్ఛక్తి అంతా 1968-69 నాటికి వినియోగించబడుతుంది.

ఆనకట్ట ఎత్తు, గర్భం మట్టానికి పైన, 330 అడుగులు ఉంటుంది. జలాశయంలో దాదాపు 1580 లక్షల ఘనపుటడుగులు లేక 36.3 లక్షల ఎకరా అడుగుల నీరు నిలవ ఉంటుంది.

శ్రీశైలం వద్ద, కనీసం 6892 క్యూసెక్కుల ప్రవాహంతో నిరంతరాయంగా కనీసం 260 మెగావాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తికాగలదు. ఇది కాక, [illegible]) మరి కొంత విద్యుత్తు ఉత్పత్తి కావచ్చు.

# వ్యవసాయదార్లకు పరపతి సౌకర్యం

వ్యవసాయదార్లకు పరపతి సౌకర్యాన్నివ్వడానికై పైలట్ పథకాన్ని అమలు పరచడానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించింది. ప్రతి జిల్లా నుంచీ ఒక సమితి బ్లాకుని తీసుకొని దానిలోని పది గ్రామాలలో యీ పథకం అమలు జరుపబడుతుంది.

వ్యవసాయోత్పత్తిని పెంపొందింపజేసే తలంపుతో, భూకా మందుల వద్దనుంచి సేద్యం నిమిత్తం భూమిని కౌలుకు తీసుకునే సన్నకారు రైతులకు లేదా కౌలుదార్లకు, వారు, గ్రామ స్థాయిలో ప్రతి కుటుంబం కొరకూ రూపొందించబడిన ఆహారోత్పత్తి ప్రణాళికననుసరించి అధికోత్పత్తిని సాధించడానికి అనువుగా ఆర్థిక సహాయాన్నివ్వడానికి భారత ప్రభుత్వం ఒక పథకాన్ని రూపొందించింది. ఈ పథకాన్ననుసరించి ఇటువంటిఆహారోత్పత్తి ప్రణాళికలుప్రతిరాష్ట్రంలో కూడా పెద్ద ఎత్తులో సిద్ధం చేయబడాలి అభివృద్ధి బ్లాకులు, గ్రామాల సంఖ్య మొదలైన అంశాలను ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు నిర్ణయించుకుంటాయి. ఈ పైలట్ ప్రాజెక్టు నిమిత్తం ఎన్నిక చేయబడే గ్రామాలలో కొంత కాలం నుంచి పని చేస్తున్న సహకార సంఘాలు వుండటం అవసరం. సభ్యులకొరకు ఆహారోత్పత్తి ప్రణాళికలు, గ్రామ సేవకులు, బ్లాకులోని ఇతర సమాజాభివృద్ధి సిబ్బంది సహాయంతో గ్రామ సంఘాలచే రూపొందింపబడాలి. అనధికార ప్రముఖులు, సంస్థల సహకారంతో ఈ పథకం అమలు జరుపబడుతుంది

ఈ పైలట్ పథకం యొక్క కొన్ని ముఖ్యాంశాలు.

దిగువ విషయాలు ఆధారంగా తీసుకుని గ్రామం వ్యవసాయోత్పత్తి కార్యక్రమాన్ని రూపొందించుకుంటుంది.

1. పంట కాలువలతో సహా నీటి పారుదల సదుపాయాలను పూర్తిగా వినియోగించుకోవటం. లాభంపొందే వారు వీటిని సక్రమంగానిర్వహించుకునేట్టుచూడటం,
2. గ్రామంలో మేలిరకం విత్తనాలను విరివిగా నిల్వ చేయటం, డబ్బు ముందుగా చెల్లించలేని వారికి యీ విత్తనాలు సప్లయి చేయటం.
3. ఎరువులు తగినంతగా సప్లయి చేయటం.
4. గ్రామంలో పశువుల పెంట, పచ్చి ఎరువును తగినంతగా ఏర్పాటు చేసుకోవటం
5. పొలం గట్లను గట్టిగా నిర్మించుకోవటం.

ఈ గ్రామ వ్యవసాయోత్పత్తి కార్యక్రమాన్ని సహకార మార్కెటింగుతో పొందిక పరచాలి.

ఆహారోత్పత్తికార్యక్రమమూ, దీనికిసంబంధించిన ఇతర విషయాలు ఆధారం చేసుకుని సెంట్రల్ బ్యాంకులు గ్రామ సహకార సంఘాలకు స్వల్ప గడువుకు, మధ్య కాలపు గడువుకు ముఖ్యంగా మేలిరకం విత్తనాలకు, ఎరువులకు అడ్వాన్సులు ఇస్తాయి.

ఈ ప్రాజెక్టులన్నింటిలో సెంట్రల్ బ్యాంకులకు, సమాజాభివృద్ధి అధికారులకు మధ్య అన్ని స్థాయిలలో సన్నిహిత సహకారం వుండాలి.

రాష్ట్రంలో యీ ప్లానులు అమలు పరచడంలో బి. డి. ఒ. ద్వారా పంచాయతీ సమితి బాధ్యత కలిగి వుంటుంది.

---

# జిల్లాల వార్తలు

## ఆదిలాబాదు

**శ్రమదానంతో రోడ్లు :-** మహాగాన్ గ్రామ వాస్తవ్యు లంతా కలిసి తమ గ్రామంలోని రోడ్లను శ్రమదానంతో నిర్మించుకున్నారు. ఇందునిమిత్తం పదిహేను రోజులపాటు రోజూ వంద మందికి పైగా పని చేశారు. ఈ గ్రామస్థులు భవన నిర్మాణం నిమిత్తం ఒక వెయ్యి రూపాయలను సేకరించారు కూడా.

**ప్రజల విరాళంతో గ్రంథాలయ భవనం :-** చిన్నూరు బ్లాకు కోటపల్లి గ్రామ వాస్తవ్యులు స్వయంకృషితో గ్రంథాలయ భవనాన్నొకదానిని నిర్మించుకున్నారు. దీనికి పుస్తకాలు కొనేందుకై పంచాయతీ సమితి రూ. 500/-లను మంజూరు చేసింది.

**మథోల్ బ్లాకు :-** మథోల్ పంచాయతీ సమితి బ్లాకులో 1959-60లో 11 కొత్త సహకార సంఘాలు ప్రారంభింపబడినవి 565 మంది సభ్యులు చేర్చుకోబడ్డారు. 15 వేల నూట 93 రూపాయలు వాటా మూలధనంగా సేకరించబడింది ఏడు కొత్త పాఠశాలలు తెరువబడినవి. 29 పాత బడులు అభివృద్ధి పరచబడినవి. 16 మంచి నీటి బావులు నిర్మించబడినవి. ఈ బ్లాకులో ప్రజల విరాళంగా 24 వేల 2 వందల 39 రూపాయలు వచ్చాయి.

**అభివృద్ధి సమీక్ష :-** ఈ జిల్లాలో 28 బావుల నిర్మాణానికై 1959-60 లో రూ. 8,750 తక్కావీ అప్పులు యివ్వబడినవి. పది ఆయిల్ ఇంజన్లు కొనుగోలుకై రైతులకు 20 వేల రూపాయల వరకు అప్పులు యివ్వబడినవి.

## అనంతపురం

**పరిశీలనా పర్యటన :-** 1960 మే నెలలో గోరంట్ల పంచాయతీ సమితి బ్లాకుకు చెందిన 45 మంది అభ్యుదయ రైతులు రాష్ట్రంలో అభివృద్ధి కార్యకలాపాలు జరిగే ముఖ్యమైన ప్రదేశాలను దర్శించారు.

## తూర్పు గోదావరి

**దుస్తుల తయారీ కేంద్రం :-** రామభద్రపురం పంచాయతీ సమితి బ్లాకులో 7-4-60 న స్త్రీలకై దుస్తుల తయారీ, దర్జీ పని, రంగు దారాల అల్లిక కేంద్రం ఒకటి తెరువబడింది. ఇందులో శిక్షణకై యింతవరకు దాదాపు 25 మంది చేరారు.

## గుంటూరు

**ప్రాథమిక పాఠశాల :-** తాడికొండ బ్లాకు పంచాయతీ సమితి అధ్వర్యాన పెదపరిమి గ్రామంలో నిర్మించబడిన ప్రాథమిక పాఠశాలా భవనం ఒకటి 25-4-60 న తెరువబడింది. ఈ భవనానికి 12 వేల రూపాయలు ఖర్చు అయినవి. ఇందులో 3వేల రూపాయలను పెదపరిమి వాస్తవ్యురాలు శ్రీమతి ఘట్టమనేని తులసమ్మ విరాళంగా యిచ్చారు.

## ఖమ్మం

**పేద హరిజనుని వితరణ :-** బూర్గంపాడు బ్లాకులో ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రం స్థాపనకై పినపాకకు చెందిన ఒక వృద్ధ హరిజనుడు నూరురూపాయలను విరాళమిచ్చాడు. ఈ సొమ్ము యిచ్చేటప్పుడు అతను చిక్కులలో ఉన్నట్లు తరువాత స్థానిక ఉద్యోగులకు తెలిసింది. అంతకు ఒక వారం ముందు అతని గుడిసె కాలిపోయింది. ఇంట్లో వాళ్లకు సుస్తీగావుంది. కాని సాహసి అయిన యీ వృద్ధుడు సమాజ శ్రేయస్సుకై తన శక్తికిమించి తోడ్పడ్డాడు. అతని ఔదార్యానికి కరిగిపోయిన ప్రజలు భూరి విరాళాలను యిచ్చారు.

**సంగీత, నాటక గోష్ఠి :-** ఖమ్మం జిల్లా సంగీత, నాటక గోష్ఠిలో దిగువ వారికి బహుమతులు వచ్చాయి.

1. వైరా పంచాయతీ కమిటీ అధ్యక్షుడు శ్రీ సంపత్ కుమార్. (ఉత్తమ సర్పంచ్ బహుమతి రూ. 500)

2. వైరా గ్రా. స్థా. కా. శ్రీ లబన్‌రాజు (ఉత్తమ గ్రా. స్థా. కా—సైకిలు)

3. శ్రీ వి. మనోరంజన్ (ఉత్తమ నటుడు)

4. శ్రీ టి. శ్యామలరావు (ఉత్తమ ఆర్గనైజరు)

5. కుమారి నయనతార (ఉత్తమ నటి)

135 రూపాయల వెండి కప్పు (ప్రథమ బహుమతి) గోష్ఠికి ఉత్తమ జట్టును పంపిన బహుళార్థ సాధక ఉన్నత పాఠశాలకు లభించగా 'నటరాజ షీల్డు' (ద్వితీయ బహుమతి) దుమ్ముగూడెం ప్రభుత్వోన్నత పాఠశాలకు లభించింది.

## కృష్ణా

జగ్గయ్య పేటలో పూ. వి. బ్లాకు :- 4-5-60న జగ్గయ్య పేటలో పూర్వవిస్తరణ బ్లాకు ప్రారంభించబడింది ఇందులో జగ్గయ్యపేట, మొక్కపేట రెవిన్యూ ఫిర్కాలు ఉన్నాయి. ఈ జిల్లాలో యిది 17 వ. బ్లాకు

3 వేల విరాళం :- గూడూరు పంచాయతీ సమితి అధ్వర్యాన ముక్కొల్లు గ్రామంలో 1960 ఏప్రిల్ 24 నుంచి 26 వరకు గ్రామ సహాయక శిక్షణా శిబిరం జరిగింది. ఇందులో 50 మంది శిక్షణ పొందారు ఈ మూడు రోజులు శ్రమదాన కృషి జరిగింది. గ్రామంలో పాఠశాలా భవనం నిర్మాణానికై శ్రీ సమ్మట శ్రీరాములు ఐచ్ఛికంగా 3 వేల రూపాయలను విరాళమిచ్చారు. ఇది యీ శిబిరం విశేషం.

## మహబూబునగరం

ఆరోగ్య కేంద్రానికి నూతన భవనం :- కొల్లాపురం సమితి బ్లాకు వీపనగండ్లలో క్రొత్తగా నిర్మించబడిన ప్రాథమిక ఆరోగ్య కేంద్రం భవనం 14-4-60న తెరువబడింది.

## నల్గొండ

పారిశ్రామిక పరిశీలనా పర్యటనలు:- నిర్ణీతమైన అనధికార్ల జట్టులు దేశంలోని ముఖ్య పారిశ్రామిక కేంద్రాలను దర్శించి అచ్చటి పారిశ్రామిక స్థితిగతులను తెలుసుకొనేందుకు వీలు కల్పించాలనే రాష్ట్ర ప్రభుత్వ నిర్ణయాన్ని అనుసరించి, యీ పర్యటనకు సమ్మతించే వ్యక్తుల పేర్లను పంపమని నల్గొండ జిల్లాలోని సమితి అధ్యక్షులందరికీ తెలియచేయబడింది.

భూదాన గ్రామంలో సహకారోద్యమం :- భూదానోద్యమానికి జన్మస్థానమైన పోచంపల్లిలో సహకారోద్యమం తగినంతగా అభివృద్ధి చెందింది ఈ గ్రామ జనాభా దాదాపు 3వేల 2వందల మంది. వారిలో అధిక సంఖ్యాకులు రైతులు నేత పని వారు అయి ఉన్నారు. రైతులకు పరపతి సౌకర్యాలు కల్పించేందుకు 250 మంది సభ్యులతో ఒక వ్యవసాయ పరపతి సంఘము, 350 మంది సభ్యులతో ప్రత్యేకం నేత పని వారికి ఒక సంఘము ఏర్పాటు చేయబడినవి. ఈ నేత పని వారి సంఘం చీరలు విదేశాలకు ఎగుమతి చేయబడుతున్నవి. ఈ గ్రామంలో 9 సహకార సంఘాలు పని చేస్తూ 100 కి 66 కుటుంబాలకు ఉపకరిస్తున్నవి. గీత పని వారికి పని చూపుటకై ఒక తాటి బెల్లం పారిశ్రామిక సహకార సంఘం కూడా ఏర్పాటు చేయబడింది.

పాఠశాలల అభివృద్ధి :- నల్గొండ జిల్లా పరిషత్తు ఆర్థిక స్థాయి సంఘం, హుజూరునగరం, దేవరకొండ, రామన్నపేట, ఆలేరు, నూతనాకల్‌లలోని సెకండరీ పాఠశాలల్లో లేబొరేటరీల నిర్మాణానికి రూ. $1\frac{1}{2}$ లక్షలను మంజూరు చేసింది.

## నెల్లూరు

కావలి కళాశాల ఆడిటోరియం :- కావలి కళాశాల ఆడిటోరియం, రిక్రియేషన్ క్లబ్బులకు 22-4-60 న శంకుస్థాపన జరిగింది. ఆడిటోరియం 55 వేల రూపాయలతో నిర్మించబడుతుంది. ఇందులో కేంద్ర గ్రాంటు 35 వేలు చేరి ఉన్నాయి

అనాధ శరణాలయానికి క్రొత్త భవంతి :- నెల్లూరుకు 5 మైళ్ళ దూరంలోగల చిన చెరుకూరులోని అనాధ శరణాలయ నూతన భవనం 24-4-60 న తెరువబడింది. ఇది 36 వేల రూపాయల ఖర్చుతో నిర్మించబడింది. ఈ విషయంలో ప్రభుత్వం 14 వేల ఐదు గ్రాంటు యిచ్చి తోడ్పడింది.

ప్రజల విరాళంతో ప్రసూతి వార్డు :- కావలి తాలూకా ముఖ్య పట్టణం ఆస్పత్రి ప్రసూతి వార్డు విస్తరణకై కావలి వ్యాపారస్థు లిద్దరు 16 వేల రూపాయలు విరాళమిచ్చారు. క్రొత్త బ్లాకు 23-4-60 న తెరువబడింది.

కావలి బ్లాకు :- 23-4-60 న కావలి పూర్వ విస్తరణ బ్లాకు ఉనికిలోనికి వచ్చింది.

## నిజామాబాదు

సమితి సభ్యులకు శిక్షణా శిబిరం :- బన్సవాడ, బోధన్

పంచాయతీ సమితుల సభ్యుల కుద్దేశించబడిన రెండవ ఓరియెంటేషన్ శిక్షణా శిబిరం బన్సవాడలో 18-4-60 న ప్రారంభమయింది.

## శ్రీకాకుళం

నీటి పనుల పథకం ప్రారంభం:- 1960 ఏప్రిల్ ఆఖరు వారంలో సాలూరు నీటిపనుల పథకం ప్రారంభించబడింది. జలాశయం లక్ష 50 వేల గేలన్ల నీటిని నిలవచేస్తుంది.

గ్రామ సహాయకుల శిక్షణా శిబిరాలు :- సీతంపేట (మొదటి అంచె) ఏజన్సీ బ్లాకుతో 31-3-60లో అంతమైన మూడు నెలల్లోను ప్రత్యేక విషయికమైన గ్రామ సహాయకుల శిక్షణాశిబిరాలు అయిదు జరిగినవి. ఇందులో మొత్తం వందా 78 మంది స్త్రీ పురుషులు శిక్షణ పొందారు.

ఆరోగ్య కేంద్రానికి పదివేలు :- షేరీ మహమ్మదు పురం బ్లాకు కింతలిలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం స్థాపనకై శ్రీ ఎమ్. వల్లభనాయుడు పదివేల రూపాయలు విరాళమిచ్చారు. శంఖుస్థాపన 1960 ఏప్రిల్‌లో జరిగింది.

ప్రసూతి వార్డు :- స్థానిక ఆస్పత్రి ఆవరణలో ఒక ప్రసూతి వార్డు నిర్మాణానికై సాలూరు వాస్తవ్యులు శ్రీ ఎ. గున్నయ్య పదివేల రూపాయలు విరాళమిచ్చారు. శంఖుస్థాపన 1960 ఏప్రిల్ ఆఖరు వారంలో జరిగింది

## వరంగల్లు

కమ్యూనిటీ రేడియో సెట్లు :- 1960 ఏప్రిల్‌లో యీ జిల్లాలో 5 కమ్యూనిటీ రేడియో సెట్లు స్థాపించబడినవి.

కార్మిక సంక్షేమ కేంద్రం :- 1959 లో వరంగల్లులోని కార్మిక సంక్షేమ కేంద్రం సల్పిన కృషి వివరాలు యివి :

ఈ కేంద్రంలో చదువుకుందికి దాదాపు 11,325 మంది వయోజనులు రాగా 9513 మంది స్త్రీలు కుట్టుపని నేర్చుకున్నారు. కేంద్రంలో జరిగిన ఫిల్ము ప్రదర్శనలను 25,910 మంది కార్మికులు చూశారు, 6,129 మంది కార్మికులు గ్రంథాలయాన్ని, పఠన మందిరాన్ని దర్శించారు. ఈ కేంద్రంలో 11,341 మంది పిల్లలకు, కార్మికులకు పాలు పంపిణీ చేయబడినవి.

## పశ్చిమ గోదావరి

చిన్న మొత్తాల పొదుపు క్రింద 32 లక్షలు :- పశ్చిమ గోదావరి జిల్లాలో 1959-60 సంవత్సరానికి చిన్న మొత్తాల పొదుపు పథకం క్రింద రూ. 32,17,555 సేకరించబడినవి.

భీమవరం బ్లాకు :- భీమవరం పూర్వ విస్తరణ కేంద్రం 1-4-60 నుంచి పని ప్రారంభించింది. ఈ కేంద్రం విస్తీర్ణం 57.34 చ. మై. జనాభా 49,372.

పంచాయతీ గ్రంథాలయం :- దెందులూరు పంచాయతీ గ్రంథాలయ భవనం 20-4-60న తెరువబడింది. ఈ భవన నిర్మాణానికై శ్రీయుతులు మోటపర్తి చిన వెంకయ్య, మోటపర్తి శ్రీరాములు గారలు వరుసగా రూ. 9000 రూ. 4000 విరాళమిచ్చారు. శ్రీమతి ఎమ్ చినవెంకయ్య రూ. 2000 విరాళమిస్తామన్నారు.

---

ఏ పనైనా ఆరంభంలో చిన్నదిగానే ఉంటుంది

— సిసిరో

# విశేషాలు

## ఆంధ్ర ఇంజనీరు ప్రతిభ

కొత్తరకం డీసెల్ ఇంజన్ పవర్ ట్రాన్స్ మిషన్‌ని కనిపెట్టిన ఘనత ఒక ఆంధ్ర ఇంజనీరుకి దక్కింది. ఈయన సిమ్లాలోని రైల్వే పరిశోధన, ప్రమాణాల సంస్థ డిప్యూటీ డైరెక్టరుగా ఉన్నారు. పేరు శ్రీ ఎమ్. ఎమ్. సూరి. ఈయన కనిపెట్టిన విషయాలవల్ల, డీసెల్ ఇంజన్ల తయారీలో ప్రపంచమంతటా విప్లవాత్మకమైన మార్పులు రాగలవట.

"సూరి ట్రాన్స్‌మిషన్" అనే యీ కొత్త పద్ధతి వలన ఉత్పత్తి ఖర్చులో 20 శాతం తగ్గడమే కాక సామర్థ్యం కూడా ప్రస్తుతం కంటే 10 శాతం హెచ్చుతుందిట.

శ్రీ సూరి వయస్సు 32 సంవత్సరాలు. ఈ కొత్తరకం ఇంజన్ల తయారీలో తోడ్పడేందుకై యీయన త్వరలోనే పశ్చిమ జర్మనీ వెడతారు.

శ్రీ సూరి రైల్వే మెకానికల్ ట్రాన్స్‌పోర్టేషన్ శాఖలో ప్రత్యేక తరగతి అప్రెంటీస్‌గా 1945లో చేరారు. ఆ సంవత్సరమే, ఇండియా స్టోర్సు యొక్క జూనియర్ రైల్వే ఇనస్పెక్టింగ్ ఆఫీసర్‌గా లండన్ పంపబడ్డారు లండన్ నుంచి తిరిగి వచ్చాక కొత్తగా ఏర్పడిన డీసెల్ ఇంజన్ శాఖలో డిప్యూటీ డైరెక్టరుగా నియమింప బడ్డారు.

* * *

## తెలుగు—రష్యన్ నిఘంటువు

రష్యా వైజ్ఞానికశాస్త్ర అకాడమీ యొక్క ప్రాచ్య భాషా విభాగం తెలుగు-రష్యన్ నిఘంటువునొక దానిని తయారు చేస్తున్నదిట. ఈ అకాడమీ యిది వరకు ఒక తెలుగు వ్యాకరణాన్ని ప్రచురించింది.

ఈ విషయం, యిటీవల హైదరాబాదులో జరిగిన ప్రథమ అఖిల భారత తెలుగు రచయితల మహాసభ సారథులకు ఒక లేఖ ద్వారా తెలియ పరచబడినది. రష్యా ప్రాచ్య భాషల సంస్థ డైరెక్టరు శ్రీ బి. సి. గఫరోవ్, దాని భారతీయ భాషల విభాగం అధిపతి శ్రీ ఇ. పి. చెలిశ్చేవ్‌లు పై లేఖను వ్రాశారు.

వేమన, పోతన, శ్రీనాథుని వంటి ప్రసిద్ధాంధ్ర కవుల రచనలు రష్యా భాషలోనికి అనువదించ బడుతున్నాయనీ, మహాకవి గురజాడ, శ్రీశ్రీలపై విపులమైన వ్యాసాలు యిదివరకే తయారు చేయబడినవనీ కూడా ఆ లేఖలో పేర్కొనబడింది.

మాస్కో, లెనిన్ గ్రాడ్, సాచ్ కెంటులలోని గ్రంథాలయాలలో ప్రసిద్ధులైన ఆధునిక రచయితలు వ్రాసిన పుస్తకాలెన్నో ఉన్నాయిట.

* * *

## కనిష్కుని కాలంనాటి నాణెములు

హైదరాబాదుకి దాదాపు అయిదు మైళ్ల దూరంలో గల కర్మన్‌ఘాట్ గ్రామంలో యిటీవల కొన్ని బంగారు నాణెములు దొరికినవిట. శ్రీరామ, బుద్ధుల బొమ్మలు గల యీ నాణెములలో కొన్ని కనిష్కుని కాలం (దాదాపు క్రీ. శ. 120) నాటివి కూడా ఉన్నాయిట. ఇవి ఒక రైతు భూమి దున్నుకుంటుండంగా దొరికినవి.

ఈ భూమి, 5 వేల సంవత్సరాల నాటిదని విశ్వసించబడుతున్న హనుమాన్ ఆలయానికి సమీపంలో ఉంది. నాగలికి యీ నాణెములుగల పాత్ర తగిలినదట రైతు ఆ పాత్రను మరొక వ్యక్తికి యిచ్చాడు. ఈ సంగతి తెలిసి పోలీసులు వచ్చి పంచనామా జరిపిన మీదట దానిని స్వాధీనం చేసుకున్నారు.



# ముఖ్య వార్తలు

21-4-60

హైదరాబాదులో ప్రైవేటు విభాగంలో త్వరలోనే మర నాగళ్ళ తయారీ ఫ్యాక్టరీ ఒకటి నెలకొల్పబడగలదని అధి కార ప్రతినిధి ఒకరు చెప్పారు.

22-4-60

సింహళంలో ఒక నెల క్రితం ఏర్పడిన యునైటెడ్ నేషనల్ పార్టీ ప్రభుత్వం పరాజయం పొందింది. పార్ల మెంటు ప్రారంభ సమావేశంలో గవర్నరు జనరల్ చేసిన ప్రసంగానికి కృతజ్ఞత తెలిపే తీర్మానం విషయంలో ఓట్లు తీసుకున్న సందర్భంలో యీ ఓటమి సంభవించింది.

23-4-60

అనంతపురం, కడప, చిత్తూరు, కర్నూలు, నెల్లూరు జిల్లాల్లో వర్షాభావం వల్ల మొత్తం మీద మెట్ట పంటలు పాడైన కొన్ని ప్రదేశాలలో భూమి శిస్తు రెమిషన్లు యివ్వ బడినట్లు హైదరాబాదులో ప్రణాళికల మంత్రి చెప్పారు.

24-4-60

క్రొత్త ఢిల్లీలో ఐ. ఎన్. టి యు. సి. 11 వ. వార్షిక సమావేశం జరిగింది.

25-4-60

శ్రీయుతులు నెహ్రూ, చౌ-ఎన్-లైల మధ్య జరిగిన ఆరు రోజుల చర్చలు ముగిసినవి. సరిహద్దు వివాదం విష యంలో ఇండియా, చైనా ప్రభుత్వాల మధ్య గల అభి ప్రాయ భేదాలు పరిష్కారం కాలేదని నేడు క్రొత్త ఢిల్లీలో జారీ చేసిన సంయుక్త వార్తా ప్రకటనలో అంగీకరించ బడింది.

26-4-60

దక్షిణకొరియా అధ్యక్షుడు సింగ్మన్‌రీ తన పదవికి రాజీనామా యిచ్చారు.

27-4-60

భారతదేశంలో నిర్ణీత జిల్లాల్లో ఆహారోత్పత్తిని. అయిదు సంవత్సరాలలో కనీసం 50 శాతానికి హెచ్చించేందుకై 10,500,000 డాలర్లను యివ్వగలనని న్యూయార్కులో ఫోర్డు సంస్థ ప్రకటించింది.

28-4-60

1959లో యివ్వ చూపిన సోవియెట్ రష్యా అప్పు 8 కోట్ల రూబుళ్ళలోను కొంత భాగంలో ఆంధ్ర ప్రదేశ్ సనత్ నగరంలో మందుల తయారీ ఫ్యాక్టరీని నెలకొల్పాలని ప్రభు త్వం సంకల్పించినదని లోక సభలో కేంద్ర పరిశ్రమల మంత్రి చెప్పారు.

29-4-60

అధికార భాషా సంఘం నివేదికపై రాష్ట్రపతి చేసిన ఉత్తర్వును కేంద్ర హోంమంత్రి లోకసభ సభ్యులకు అంద చేశారు ఆ ఉత్తర్వు ప్రకారం 1965 పిమ్మట హిందీ అధి కార భాష కాగలదు.

30-4-60

భారతదేశ సమైక్యతను కాపాడవలసిన అగత్యాన్ని గురించి జ్ఞాపకం పెట్టుకోవాలని మరాటీ ప్రాంతాల ఏకీ కరణకు ఆనందిస్తున్న మహారాష్ట్రుల నుద్దేశించి బొంబా యిలో ప్రధాన మంత్రి విజ్ఞప్తి చేశారు.

1-5-60

రెండు క్రొత్త రాష్ట్రాలు — మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాలు ఏర్పడినవి.

2-5-60

భారతదేశంలో అమెరికా రాయబారి డా అహమ్మద్ బెనాబడ్ హైదరాబాదులో బాండుంగ్‌దే సమావేశాన్ని ప్రారంభించారు.

3–5–60

లండన్‌లో కామన్వెల్తు ప్రధాన మంత్రులు సమావేశమైనారు.

4–5–60

అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ వాషింగ్టన్‌లో ఒక ఒప్పందంపై సంతకం చేశారు దీని ప్రకారం అమెరికా మన దేశానికి వచ్చే నాలుగు సంవత్సరాలలోను 1500 ఓడల గోధుమలను, బియ్యాన్ని పంపుతుంది. ఇండియా తరపున కేంద్ర ఆహార మంత్రి శ్రీ ఎస్. కె. పాటిల్ సంతకం చేశారు.

5–5–60

మే 1 వ తేదీన రష్యా భూభాగంలో ఎగిరే అమెరికా విమానం ఒకటి కాల్చివేయబడినదనీ, యీ విషయం మిత్ర రాజ్య సమితి భద్రతా సంఘం దృష్టికి తీసుకొని రాబడ గలదనీ రష్యా ప్రధాని శ్రీ నికిటా కృశ్చేవ్ రష్యా పార్లమెంటు సభ్యులకు చెప్పారు.

6–5–60

ఉప రాష్ట్రపతి డా. ఎస్. రాధాకృష్ణన్ హైదరాబాదులో ప్రథమ అఖిలభారత తెలుగు రచయితల మహాసభను ప్రారంభించారు

7–5–60

పోలెండు అప్పు రూ. 14 3 కోట్ల వాడకం నిమిత్తం కొత్త ఢిల్లీలో ఇండియా పోలెండులు ఒక ఒప్పందంపై సంతకాలు చేశాయి

8–5–60

ప్రధాన మంత్రి నెహ్రూ, ఫ్రాన్సు అధ్యక్షుడు ఛార్లెస్ డిగాలీలు పారిస్‌లో సమావేశమయారు

వ్యవసాయోత్పత్తి హెచ్చుదలకు ఉద్దేశించబడిన కేంద్ర ప్రభుత్వపైలట్ పథకాన్ని 20 సమితి బ్లాకులలో అమలు జరుప ప్రభుత్వం నిర్ణయించినట్లు రాష్ట్ర ప్రణాళికలు, సమాచార శాఖ మంత్రి పత్రికా విలేఖరులకు చెప్పారు.

9–5–60

15 కోట్లు ఖర్చుకాగల పోచంపాడు ప్రాజెక్టుకై తెలంగాణా సెక్యూరిటీల నుంచి రూ. 7 కోట్లను ఖర్చు చేయాలని రాష్ట్ర ప్రభుత్వం సంకల్పించినట్లు హైదరాబాదులో నేడు పబ్లిక్ వర్క్సు మంత్రి అన్నారు.

10–5–60

మేడే నాడు అమెరికా విమానం రష్యా భూభాగంలోనికి వచ్చినందుకు రష్యా అమెరికాకు తన అభ్యంతరం తెలియజేసింది

11–5–60

మద్రాసు, మహారాష్ట్ర, గుజరాత్ పశ్చిమ బెంగాలు, మధ్యప్రదేశ్‌లలో మరి ఏడు చిన్న స్టీల్ బ్లాస్ట్ ఫర్నేస్‌ల స్థాపనను కేంద్ర ప్రభుత్వం మంజూరు చేసింది.

12-5-60

గుంటూరు జిల్లా తంగెడకు దాదాపు 200 గజాల దూరంలో కృష్ణానదిలో ఒక పడవ మునిగిపోయి 87 మంది మరణించారు

13–5–60

ఆచార్య వినోబా భావే యూసెట్ ఘాట్ వద్ద చంబల్ నదిని దాటి మధ్యప్రదేశ్‌లో ప్రవేశించారు. చంబల్ లోయలోని బందిపోటు దొంగలను సన్మార్గంలో పెట్టే భారాన్ని వారు వహించారు.

పది రోజులు జరిగిన కామన్వెల్తు ప్రధానుల సమావేశం సమాప్తమైనది

14–5–60

పరిశ్రమలు మునిసిపలు పరిపాలన శాఖా మంత్రి బోర్డు ఫోలియోలను ముఖ్యమంత్రి స్వాధీనం చేసుకున్నారు

15–5–60

పారిస్‌లో శిఖరాగ్ర సమావేశం జరగబోయేముందు, రోదసిలోనికి మనుష్యులను పంపడానికి వీలైన ఉపగ్రహాన్ని పైకి పంపినట్లు రష్యా ప్రకటించింది

16–5–60

అమెరికా రష్యాపైకి గూఢచారి విమానాలను పంపడం మానితేతప్ప, శిఖరాగ్ర సమావేశాన్ని 6-8 నెలల పాటు వాయిదా వేయాలని పారిస్‌లో నికిటాకృశ్చేవ్ ప్రకటించారు.

17–5–60

నీరా నుంచి పంచదార తయారీకై అఖిల భారత ఖాదీ, పరిశ్రమల కమిషన్ ఒక కొత్త పద్ధతిని కనుగొన్నట్లు యీ కమిషన్ తాటి బెల్లం సలహాదారు హైదరాబాదులో చెప్పారు.

రాష్ట్ర గవర్నరు తిరుపతిలోని ప్రాంతీయ యాత్రిక సమాచార కేంద్రాన్ని ప్రారంభించారు.

18–5–60

రాష్ట్ర ముఖ్య మంత్రి కొత్త ఢిల్లీలో ప్లానింగ్ కమిషన్ సభ్యుడు శ్రీ సి. ఎమ్. త్రివేదీతో చర్చలు జరిపారు.

19–5–60

ఖట్మండూలో నేడు చేరిన వార్త ప్రకారం మే 17 వ. తేదీన బ్రిటిష్–ఇండియన్–నేపాలీస్ సర్వీసెస్ జట్టు ఒకటి 26 041 అడుగుల ఎత్తుగల హిమాలయ శిఖరం అన్నపూర్ణ 11ను అధిరోహించింది. ఈ శిఖరాన్ని యింత వరకూ యెవరూ అధిరోహించ లేదు.

20–5–60

ఈ సంవత్సరం తరుగు నెలల్లో చౌక దుకాణాల ద్వారా అమ్మకానికై బియ్యం కొని విక్రయించేందుకై రాష్ట్ర ప్రభుత్వం పది లక్షల రూపాయలను మంజూరు చేసింది.

———:*:———

ఆధ్యాత్మికంగా చరిత్ర విశ్వజనీనతను సంతరించుకొన్నది. అది ఐరోపా ఆసియాలను గురించి కాని తూర్పు పశ్చిమ దేశాలను గురించి కాని చెప్పదు. అన్ని దేశాలలోను అన్ని కాలాలలోనూ గల మానవ జాతిని గురించి చెబుతుంది. రాజకీయంగా విభజించ బడినా ప్రపంచం ఒక్కటే, మనకు నచ్చినా నచ్చకపోయినా యిది నిజం. ప్రతి ఒక్కరి సౌభాగ్యానికి యితరుల సౌభగ్యంతో సంబంధమున్నది. కాని మనలో ఆధ్యాత్మిక చింతన లోపించింది, వ్యష్టి సమష్టి పరంగా అహం హెచ్చింది. ఇందువల్ల విశ్వ సమాజ ఆదర్శం కష్టసాధ్యమైనదిగా కన బడుతున్నది. నేడు మనకు కావలసినది ఆధ్యాత్మిక దృష్టి. మన దేశం ఎన్ని తప్పులు చేసినా ఎన్ని తప్పటడుగులు వేసినా యీ దృష్టి లోపందానికి లేదు. తిరిగి అది మానవ జీవితానికి కరదీపిక కాగలదు. మళ్లీ మనం ఆధ్యాత్మిక స్వాతంత్ర్య ఆదర్శాన్ని పునరుద్ధరించుకోవాలి. శాంతి ఆంతరంగికమైనది, కాబట్టి మనం దానిని కోరితే అంత స్సంఘర్షణలను అంతం చేసుకొని మనస్సును నిర్మలం చేసుకోవాలి. ఏమి పోయినా మనని మనం పోగొట్టుకో కూడదు. స్వచ్ఛమైన ఆత్మయొక్క ప్రేమకు అవధులు లేవు. అది మానవులందరూ దైవాంశ సంభూతులని గుర్తి స్తుంది. మానవ జాతి శ్రేయస్సుకై సంతోషంతో తాను బలిఅవుతుంది.

— ఎస్. రాధాకృష్ణన్

# పాఠకుల లేఖలు

## వ్యంగ్య చిత్రాలు

మీ పత్రికలో కార్టూనులు వ్యంగ్య చిత్రాలకు కొంత స్థలము కేటాయించిన పిల్లల్ని గూడా ఆకర్షించ గలదని నామనవి.

— వి. వి. కృష్ణారెడ్డి,
కోవూరు (నెల్లూరు జిల్లా)

[ఈ సంచికలో ఒక కార్టూను ఉంది. చక్కని వ్యంగ్య చిత్రాలు పాఠకులు కూడా పంపవచ్చు —సం.॥]

## "చాలా ఉపయోగం"

ఏప్రిల్ నెల 'ఆంధ్ర ప్రదేశ్' పత్రిక చూడటం తటస్థించింది. మీ పత్రిక చాలా చక్కగా వున్నది. బడ్జెటు మీద వ్రాసిన వ్యాసములో చదువరులకు ముఖ్యమైన సమాచారం క్లుప్తముగా తెలియ జేయబడినది. ఇటువంటి పత్రిక ప్రభుత్వ సమాచారములు తెలియ జేయుటకు చాలా ఉపయోగపడుననుటలో సందేహం లేదు.

— మాధవపెద్ది ప్రసాద్,
బాపట్ల

## పురాణ గాధలు

"ఆంధ్ర ప్రదేశ్" సంచిక అన్ని విధముల బాగా ఉన్నది. కాని వీటితో పాటుగా పురాణ గాధలు కూడా (భాగవత, రామాయణాదులు) సీరియల్‌గా ప్రచురించిన మరీ యెక్కువగా ఆదరణ పొందునని విశ్వసించుచున్నాను.

క. జనార్దనరావు,
బరంపురం (ఒరిస్సా).

[పురాణ గాధలు ప్రకటించటానికి యీ పత్రికలో స్థలం చాలదు — సం॥.]

## నూతన రచయితలు

ప్రముఖుల రచనల కంటే నూతన రచయితల కెక్కువ ప్రాధాన్య మివ్వడం యీ పత్రిక ప్రధానోద్దేశంగా పెట్టుకుంటే పత్రిక యింకా ప్రజల మన్ననల నందుకోటానికి వీలుంటుంది.—

కె. వి. నాథం,
నిజామాబాద్

[ఏ రచయితలు పంపినా రచనల విలువను బట్టే ప్రకటించటం జరుగుతుంది.—సం.]



ముంజేతి కంకణమున కద్దమేల.

* * *

తా బట్టిన కుందేటికి మూడే కాళ్లు.

(సామెతలు.)

# రచయితలు

శ్రీ పి రంగారెడ్డి—ఆంధ్ర ప్రదేశ ప్రణాళికల, సమాచార శాఖల మంత్రి.

డా. ఏ అప్పారావు— బాపట్లలోని వ్యవసాయ కళాశాలలో ఉపన్యాసకులు.

చెరుకుమిల్లి భాస్కరరావు—చీఫ్ కన్వీనర్, సాంఘిక విద్యా కేంద్రము, చిక్కడ్‌పల్లి, హైదరాబాద్.

డా. యస్. వి. జోగారావు— ఆంధ్రోపన్యాసకులు, ఆంధ్ర విశ్వ విద్యాలయము, వాల్తేరు.

శ్రీ కొంపల్లి మల్లిఖారునరావు — నకరికల్లు, నల్గొండ జిల్లా.

శ్రీ యస్. రాజన్న—త్యాగరాజ వీధి, ప్రొద్దుటూరు.

శ్రీ అన్నపరెడ్డి రాఘవరావు— అవనిగడ్డ, కృష్ణాజిల్లా

శ్రీ అన్నాప్రగడ శ్రీరామమూర్తి—నాదెండ్ల, గుంటూరు జిల్లా

'అనూరాధ'—ధవళేశ్వరం, తూర్పు గోదావరి జిల్లా.

'ఉషశ్రీ', 'కనక్ప్రవాసి' — తరుణ సాహితీ సమితి, ఆలమూరు తూర్పు గోదావరి జిల్లా.

'విద్యాదేవి కులపతి'—శ్రీ పి. వి. యల్. వి. ప్రసాద రావు, ఆంధ్ర శాఖ, హిందూ కళాశాల, గుంటూరు.

శ్రీనివాస చక్రవర్తి—'నాట్యకళ' పత్రికా సంపాదకులు, విజయవాడ.

'కులపతి'—హైదరాబాదు.

శ్రీ డి. రాజబాబు — పైన. (వయా) బిక్కవోలు, తూర్పు గోదావరి జిల్లా.

శ్రీ కానాదిభట్ల వెంకట సుబ్బారావు — నర్సాపురం, (వయా) విస్సన్నపేట, కడప జిల్లా.

——:*:——

ఒరులపనికిఁగా నిజహిత
విరహితుఁడగునట్లు గాదె వివిధేంద్రియకా
ర్యరతుండై యాత్మసము
ద్ధరణంబును జేయకునికి ధరణీనాథా

— భార. శాంతి.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | | |
|---|---|---|
| వైశాల్యం | .... .... | 1,06,041 చదరపు మైళ్ళు |
| జనసంఖ్య | .... ... | 3,12,60,133 |
| పురుషులు | .... ... | 1,57,42,912 |
| స్త్రీలు | .... ... | 1,55,17,221 |
| సగటు వర్షపాతం | .... .... | 35.65 " |
| అరణ్య ప్రదేశం | .... ... | 1,40,26,000 ఎకరాలు |
| జిల్లాలు | .... ... | 20 |
| తాలూకాలు | .... ... | 163 |
| రెవిన్యూ సర్కిళ్లు | .... ... | 1,000 |
| పట్టణాలు | .... ... | 293 |
| గ్రామాలు | .... ... | 26,450 |
| పంటలక్రింది ప్రదేశం | .... ... | 2,93,81,060 ఎకరాలు |
| కౌళ్ళ సంఖ్య | .... ... | 42,42,655 |
| 1958-59 లో నీటి పారుదలను పొందిన ప్రదేశం | ... | 68 లక్షల ఎకరాలు |
| 1958-59 లో వుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | ... | 61.56 లక్షల టన్నులు |
| పాల వుత్పత్తి | .... ... | 15.5 లక్షల గాలన్లు |
| రైలు మార్గాలు | .... ... | 2,902 మైళ్ళు |
| జాతీయ రహదార్లు | .... ... | 1,409 .. |
| రాష్ట్ర రహదార్లు | .... ... | 2,072 .. |
| జిల్లా పెద్ద రోడ్లు | .... ... | 2,527 .. |
| జిల్లా ఇతర రోడ్లు | .... ... | 3,458 .. |
| పాఠశాలలు | .... ... | 28,000 |
| కళాశాలలు | .... ... | 64 |
| వృత్తి విద్యా కళాశాలలు | .... ... | 31 |
| ద్వితీయ పంచ వర్ష ప్రణాళిక ప్రమాణం | | రూ. 175.37 కోట్లు |

**1960-61 బడ్జెటు:**

| | | |
|---|---|---|
| ఆదాయం | ... | రూ. 82.18 కోట్లు |
| వ్యయం | .... ... .. | 81.98 .. |
| పెట్టుబడి ఖర్చు | ... ... .. | 32.44 .. |

